శ్రీరస్తు.

భక్తిరస

# శతకసంపుటము

౨




చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1926.

ముగిసినను తిరుగ నొసంగకపోవుటకేగాక వంగూరు సుబ్బారావుగారు కీర్తిశేషులగుటయుం గూడ నివారించి మరల మొదలెత్తి చిరకాలముక్రిందట సంకల్పించిన శతకసంపుట ప్రకటన మిప్పటికి సాగించితిమి. క్రమముగ వేలువేలుసంపుటములుగ భక్తి, శృంగార, నీతి, మతవిషయశతకములతో నింకం గొన్ని సంపుటములను ప్రచురింపనున్న మాయుద్యమమున కాంధ్రమహాజనులతోడ్పాటవసరము

మొదటి సంపుటమున ముద్రితాముద్రితశతకములు 20 సమకూర్చితిమి. ఈ రెండవసంపుటమున 20 సమకూర్చినారము. ఇందలి యముద్రితశతకములన్నియుం బ్రచురణార్థము మాకొసంగుటయేగాక శతకములనన్నింటిని సంస్కరించి విపులములగు పీఠికలు వ్రాసి శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు తోడ్పడుటచే నిప్పటికి సర్వాంగ సుందరమగు భక్తిరసశతక మొదటిసంపుటము ప్రచురింపం గలిగితిమి.

ఆంధ్రమహాజనుల యాదరణప్రోత్సాహములం బట్టి కడమసంపుటములనుగూడం ద్వరలోం బ్రచురించుటకుం బ్రయత్నింప నున్నారము.

తండయార్పేట,
చెన్నపురి.
1-3-1926.

ఇట్లు,
వావిళ్ల. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

# విషయసూచిక.

# పీఠిక.

ఈ సూర్యనారాయణశతకమును వరాహ వేంకట నృసింహాకవి రచించెను. ఇతఁడు భారద్వాజ గోత్రుఁడు, బ్రాహ్మణుఁడు. జగన్నాయకశతకము రచించిన వరాహగిరి కొండరాజు నీతఁడు నేకగోత్రులె గాని యిరువురును తమ పూర్వులను జెప్పికొనక పోవుటచే నిందెవరు పూర్వులో యిరువురకుఁ గల సంబంధమెట్టిదో తెలియుఁగ వీలుకాలేదు.

"శ్రితసంపత్సుమవల్లియా సరసవెల్లిన్" అను పద్యమువలనఁ గవి సరసవెల్లిలోని సూర్యనారాయణస్వామినిగూర్చి యీశతకము రచించెనని యూహింపనగునుగాని సరసవెల్లి యెచట నున్నదో కవి సంబంధు లెవరేని యటఁ గలరేమో తెలియవచ్చుట లేదు. తత్రత్యులీ విషయమునఁ బ్రయత్నించి కవి జీవితము ప్రచురించుట యవసరము.

ఈ సూర్యనారాయణశతకము భాష జటిలముగ సాంస్కృతిక సమాసబంధురముగ నున్నది. కొన్ని చోటుల పద్యమునంతటి నాక్రమించికొనిన సమాసములు గలవు. భావములు స్వతంత్రములై రమణీయములై యున్నవి. సూర్యభగవానుని తేజోవిభ

వములు, ప్రభావములు, శక్తిసామర్థ్యములు పురాణకథలు ఒక్కొక్కపద్యమున నొక్కొక్క రీతిగాఁగవి వర్ణించి తనకవితానైపుణ్యము సాటియున్నాఁడు ఇంకలి పద్యములు స్వతంత్రము లనియుఁ బ్రాతస్స్మరణీయములనియుఁ దలంచుచున్నారము.

ప్రశస్తమగు నీశతకము ప్రచురించిన వావిళ్లవా రాంధ్రజనులకు వందనీయులు.

నందిగామ. 1-1-25 } ఇట్లు, శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

# సూర్యనారాయణశతకము.

---

శా. శ్రీమత్సర్వసుపర్వసేవితము లై క్షేమాంకల
క్ష్యంబులై, ధామధ్వస్తసమస్తలోకనిబిడధ్వాం
తంబులై మించునీ, రామాంఘ్రుల్ గొనియాడి
వృత్తశతకగ్రంథంబు నీకింపుగాఁ, బ్రేమన్ గూ
ర్చెదఁ జిత్తగింపు మెలమిన్ శ్రీసూర్యనారా
యణా. 1

శా. భారద్వాజపవిత్రగోత్రజుఁడ విప్రశ్రేష్ఠవంశ్యుం
డవి, ద్వ్యాసక్తుండ వరాహవేంకటనృసింహాఖ్యుం
డ సద్భక్తి నిం, పారం గొల్చెదు నీకు వృత్తశ
తకం బర్పింతు నాగ్దోషముల్, చేరం జూచి కృ
పన్ సహింపు మదిలో శ్రీసూ... 2

మ. అరయన్ బావనమైన యీశతకపద్యవ్రాత
మాలించినన్, బరమప్రీతిఁ బఠించినన్ బుధులు
నీపాదాంబుజధ్యాతలై, దురితధ్వాంతవిముక్తిఁ
గాంచి శుభముల్ తోడ్తోఁ బ్రవర్తింప నీ, చిర
కారుణ్యమతిన్ సుఖింతు రెపుడున్ శ్రీసూ...

మ. శ్రితసంపత్సుమవల్లి యానరసవిల్లిన్ మల్లికా
ద్యుల్లస, ల్లతికావేల్లితసాలమూలకుసుమారా

వస్ఫురద్దేవుని, శ్రితగేహంబునఁ బద్మినీముఖస
తుల్ సేవింప ధాత్రీసురా, ర్చితలీలాకృతి
నొప్పునిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 4

శా. శ్రీమత్పద్మసముద్భవాదితనువుల్ చేకొంచు
నెవ్వాఁడు నా, నామంయల్ గనుపట్టముజ్జగ
ములఁ గావించు రక్షాలయ, వ్యామోహంబున
నొప్పునట్టి నిగమవ్యాలీఢపాదాబ్జు నిఁ, బ్రేమఁ
గన్గొని సంస్మరింతు మదిలో శ్రీసూ... 5

శా. ఛాయాదిప్రియకాంతలఁ మధురభాషాలీలచేఁ
దన్పుచుఁ, గాయం బుజ్జ్వలమై పరిష్కృతపరి
ష్కారంబునై మించ లో,కాయాసంబు లణంచి
దుర్మదబలవ్యాసంగిదైత్యోత్కరా, జేయస్ఫూర్తి
నెసంగు నిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 6

శా. వేదప్రోక్తసుస్కృతు ల్పలుపుచుఁ బృథ్వీసు
రు లైచ్చి నీ, పాదాబ్జస్మరణైకనిత్యభజనాపారీణు
లై నిల్వఁగా, ఖేదంబు ల్తొలఁగించి వారలకు
నుత్కృష్టాపవర్గం బవి, చ్ఛోదాసక్తి నొసంగు
నిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 7

మ. అకలంకస్ఫటికంబు నూతనజపాదక్షద్దీప్తి నాగం
తుక, ప్రకటచ్ఛాయ ధరించినట్లు జలగోళం
బౌటఁ జంద్రుండు నీ, సకలోస్త్రంబులు దాల్చి

షోడశకళాసంపూర్ణుఁడై ధ్వాంతమూ, లిఁ కెల్లన్
బరిమార్పుచుఁ దిరుగఁడే శ్రీసూ... 8

మ. అవనిన్ భూసురవర్యులవ్విధినిషేధాచారసంప
న్నులై, సవనాదిక్రియ లగ్నిహోత్రజపముల్
సంధ్యానమస్కారముల్, శివపూజాదికమున్
ఘటించి నిఖిలక్షేమంబు లర్థించుచున్, శివరూ
పుండ వటంచు నెంతురు గదా! శ్రీసూ... 9

మ. భవదుస్రంబులు కాలవేగమున శుంభద్వ్యోమ
భాగంబునన్, బవనోద్ధూతము లై ఘనంబు
లగుచున్ బొట్టిల్లి నిర్ఘాతమై, రవరావంబు లె
సంగ భూరిజలధారావృష్టి రక్షింపవే, నృపవరు
లెచ్చగ సస్యపంక్తి నెచటన్ శ్రీసూ... 10

శా. లోకాలోకము దాఁటి చండకిరణాలోక్యస్వకా
యప్రభా, సీకం బొప్ప ననేకలోకతిమిరోన్మేషం
బు వారించి యస్తోకాసక్తి నశేషజంతుతతి నెం
తో బ్రోచు చున్ జిత్తనా, ళీకాభ్యంతరసీమ
నిల్పి కొలుతున్ శ్రీసూ... 11

మ. ఖచరత్త్వాత్కరదీప్తమూర్తు లగుచున్ గన్పట్టు
చంద్రాదులన్, గనుఁగొంచున్ గణకుల్ సుఖా
ర్తిఫలసంధాతల్ గదా యంచు గొబ్బున నూ
హింతురు కూడు నే భువనముల్ పుట్టించి రక్షిం
చి త్రుంచి నటింపంగలకర్త నీవు గలుగన్ శ్రీ...

మ. హరిపాదంబునఁ బుట్టి దేవనది పూతాకారయై
తా మహేశ్వరమౌళిఁ విహరించుచాద్భుఁ
జతుర్వక్త్రాననోత్థంబు లై, గిరులై వేదము లా
త్మమండలమునఁ గీర్తించుచుఁ నిల్వఁగా,
సిరులఁ బెంపగుచున్న నిన్నుఁ దలఁతుఁ శ్రీ
సూ... 13

మ. అనలప్రాప్తనిజోచితాహుతులు సీకర్పించి బర్హి
ర్ముఖుల్, వెనువెంటఁ గొనియాడి బ్రహ్మాదిభా
వింపంగ వేఱొక్క డే, పునఃకైవల్యమొసంగు
మంచుఁ గుజనవ్యూహంబుతోఁ గోరినఁ, విను
వారందఱు నవ్వకుందురె ననుఁ శ్రీసూ...14

మ. జలజిన్యాదినిజాంగనాముఖసరోజాతంబులం జెం
ది ని, శ్చలసారంగము లైనచూపులఁగృపాసా
రంబు వర్షించి చం, చలభక్తోత్కరతాపపావకశి
ఖాసంఘుంబుఁ జల్లార్చుచుఁ, జెలువొందఁ గను
పట్టునిన్నుఁ గొలుతుఁ శ్రీసూ... 15

మ. స్వకళాచాతురి నైంద్రజాలికుఁడు నాసారం
ధ్రమార్గావరో, ధకసాళంబుఁ గుంభనీరముఁ
బలెఁ ధాత్రీజలం బెల్ల ది, వ్యకరౌఘంబునఁ
బూని యభ్ర మయి యయ్యప్పుఁ విసర్జించు
చుఁ, విశ్రుతు ల్మాన్చి వెలుంగునిన్నుఁ గొలు
తుఁ శ్రీసూర్య... 16

మ. హరిసక్తిన్ జవవృత్తిఁ గాంచి యరుణోద్యద్దీ
ప్తిఁ బెంపారి నిర్జరకోటుల్ జయశబ్దపూర్వకన
మస్కారంబు లర్పింప నం,బరమార్గంబున నేగు
నీరథగతప్రస్ఫీతచక్రంబు సు, స్థిరతన్ మించు
సువర్ణనంబుకరణిన్ శ్రీసూ... 17

శా. రక్తశ్వేతవినీలవర్ణముల చేరంజిల్లు కాలత్రయ,వ్య
క్తస్వాకృతి పంకజోదరపురార్యంభోరుహాక్షప్ర
భా,యుక్తిన్ దత్కృతవాసకాలమును! దద్యో
గంబుఁ దెల్పం గృపా, రిక్తస్వాంతముతోడఁ
జూడఁదగునే శ్రీసూ... 18

మ. జలకుంభాంతరసీమలందు నభముం జందాన జం
తూత్కరో, జ్జ్వలదంతఃకరణంబులన్ బ్రతినిధి
వ్యాపారమున్ జూపి పెం,పలరన్ బ్రాణివితాన
మై మునిమనోధ్యానార్హరూపంబు రం, జిలఁ
గన్పట్టెడునీ కొనర్చెద నతుల్ శ్రీసూ... 19

మ. త్రుటి యైనన్ జెడకుండ షష్టిఘటికారుద్ధంబు
లౌచున్ సము, త్కటవృత్తిన్ దినరాత్రముల్
సమను లై కల్పాంతపర్యంత మెం,చ్చుటఁ గానం
బడు నెవ్విభుం డఖిలవిశ్వధ్యేయచిద్రూపుఁ డై,
నిటలాక్షుంబున మించు నీవు గలుగన్ శ్రీసూ.

మ. జగతిన్ వార్షికవృష్టి నంకురతతిచ్ఛాయన్ జికీ

ర్షోన్నతిఁ, జగము ల్గ్రక్కున నీవయిం బోడ
ముచుఁ వర్తించుచున్నఁ జీహ్వఽర్షఁ గృశాను
డు జలంబునంబలె నపృశ్యస్ఫూర్తి నాటింపుచో,
నిగమంబుల్ దెలుపంగ శక్యమె నినుఁ శ్రీ...

మ. మునిదిగ్భర్తలు విష్ణుశంకరులనం బూజ్యాం డజుం
డంబి ర', నజా తెకేల యోగమాయఖచరవ్రాతా
గ్రగణ్యుండవీ, నుచుం బల్కుపురాణశాస్త్ర
ములు సత్యం బంచు నార్యుండు కో, రినకోర్కు
ల్ కొనసాగ నిన్నుఁ గొలుచుఁ శ్రీసూ...22

శా. వేదంబుల్ భవదీయబింబగము లై వెల్గొంది యే
వేళ నీ, పాదధ్యానము సేయుచుఁ గనుచు ని
న్భావింప లేకున్నచో, భేదజ్ఞానము చేత నాకెటు
లొకో వేద్యంబు లై యుండు ను, శ్రీదాకారము
లై ననీదుపదముల్ శ్రీసూ... 23

మ. కులిశాబ్జాంకుశఖడ్గచక్రజలరుట్కోదండమత్స్య
ధ్వజా, వ్యలఘుప్రస్ఫుటరేఖ లొప్ప విమలోద్య
ద్రక్తకాంతిచ్ఛటా, కలనోత్కృష్టము లై యజా
దిసుమనోగమ్యంబు లై కూడి నర్తిలు నీదివ్య
పదంబు లాత్మఁ గాంచుతుఁ శ్రీసూ... 24

మ. ఉదయాద్రిఁ గనుపట్టి గిట్టి జలజవ్యూహంబు
తో జంతువుల్, మునుమొందఁ భటవర్గమోహాత

వ మున్ లోకాంధకారంబుతోఁ, దుదిముట్టన్ విద
ళింపుచున్ భువనబంధుత్వంబు వాటించుచున్, మృదు
పాదాంబుజముల్ దలంతు మదిలో శ్రీసూ...

శా. ఆయుర్దాయ మణంచి మానవులు పుణ్యాపుణ్య
రూపక్రియల్, సేయంజూచుచు సాక్షివై నిలిచి
యక్షీణప్రభావోన్నతిన్, గాయంబుల్ పడఁ
ద్రోచుచున్ యముఁడవై నాకాదిలోకస్థితుల్,
దేయప్రక్రియ సంఘటింతువు గదా శ్రీసూ...

మ. సుతదారాద్యఖిలంబె ముఖ్యమని చూచున్
శాశ్వతం బంచు సం,తత మజ్ఞాని బుధుండు శోక
రహితానందామృతోద్యోగసం,గతి కర్తవ్య మ
టంచు నాగమశిఖాగమ్యత్వదంఘ్రిద్వయా,ర్పిత
చిత్తంబున వర్తనంబు సలుపున్ శ్రీసూ... 27

మ. అరుణత్వంబును బంకజాతదళసవ్యాపారమున్
శ్రీమనో,హరరూపంబును దేవతామకుటరత్నౌ
ఘప్రతిచ్ఛాయయున్, దరచక్రాసిధనుర్ముఖప్రబల
నానాచిహ్నము ల్దాల్చి మిం,చిరి నీవున్ భవదం
ఘ్రు లొక్కకరణిన్ శ్రీసూ... 28

మ. సునిదాఘువ్యథఁ జిక్కి చాతకము సంక్షోభించి
నీలాభ్ర ద,ర్శనమున్ గోరినమాడ్కి భూరిభవసం
జాతార్తి నే నెంతయున్, వనటన్ గుందుచు నిష్ట

మొందక మదిఁ బ్రార్థించి తేవంకఁ జూచిన
యుష్మద్దయ దక్క యొండు గలదే శ్రీసూ...

మ. ఇలఁ దీవ్రాతపబాధ కోర్వక నరుం డెంతే వడిఁ
బాఱి చెంతల నున్న ట్టికుజంబుఁ జేరుగతి నానా
ఘోరసాంసారిక జ్వలనజ్వాలలఁ జిక్కి మానవుఁ
డుసంజాతార్తి నీపాదముల్ విలసద్భక్తిఁ దలంచి
కొల్చును గదా శ్రీసూ... 30

మ. కలికాలంబున భక్తియోగమహిమన్ గైవల్య
మర్థించి యార్యు లమేయశ్రవణక్రియావిము
ఖులై యుష్మత్కథాజాలమున్ బలుమాఱున్ బఠి
యించి నిత్యము భవత్పాదాంబుజధ్యానము ర్మిలిఁ
గావింపుచు ముక్తు లౌదురుగదా శ్రీసూ... 31

మ. అరవిందప్రభవాభవప్రముఖసర్వామర్త్యవర్యుల్
భవత్పరమప్రాభవసాగరోర్మికలనాప్రాదుర్భవాం
భఃకణో త్కరమొక్కమ్మడిఁ గ్రమ్మినన్ వివశులై
కన్నింతు రే నెంత చెచ్చెరఁ గారుణ్యముతోడఁ
బ్రోవఁ దగదే శ్రీసూ... 32

శా. మాయాపింఛికఁ దాల్చి కౌతుకముతో మాయా
విచందంబునన్ ద్రోయన్ రాని తమోవిభూతి
జగతిన్ దోరంబుగా నింపి యే చాయన్ మూల
మెఱుంగనీక మహిమన్ సర్గాదికృత్యంబులన్
జేయం జాలిననీకొనర్చెద నతుల్ శ్రీసూ... 33

శా. నీనామస్మరణంబుచేతదురితానీకంబు మాద్యద్బృహ,
ద్భానుజ్వాలల శుష్కదావముగతిన్ భస్మీకృ
తంబై జనం,దా నత్యంతవిశుద్ధబుద్ధిఁ దగి నీదాసుం
డు హృత్సారసా, సీనుం జేయుచు నిన్భజించును
గదా శ్రీసూ... 34

మ. అమనోవాక్పథితిపాద్యుఁ డంచు శ్రుతు లుద్య
చ్ఛక్తిఁ దెల్పంగ న,క్రమవృత్తిన్ మదిలో స్మరిం
చుచు నవార్యస్ఫూర్తిఁ గీర్తించినన్,సుమనీషుల్
దగ దంద్రు దోషము ఘటించున్ గాన ని న్నెం
తయున్, విమలజ్ఞానఫలోపలబ్ధిఁ గొలుతున్ శ్రీ
సూ... 35

మ. అభవేభాస్యహరీనచండికలలో నాద్యుండ వీవం
చునో,కృభవద్భక్తియెముక్తిహేతువని వేద్కం
గోరియుష్మత్పద,ప్రభవప్రాభవముల్ గణించుచు
మదిన్ బ్రార్థించి తెచ్చంగి భూ,రిభవాంభోధిఁ
దరింపఁ జేసెదొకదా శ్రీసూ... 36

శా. కామక్రోధమదాదిశత్రువులు నీక న్మాఁకమైతాఁకి
చే,తోమాలిన్య మొసర్పఁ దక్కలుష చిత్తు లోప్ర
ధనిర్ముక్తులై, నీమంత్రంబు జపించి నీచరణముల్
నిత్యంబు సేవించుచున్, బ్రేమన్ బంధవిముక్తిఁ
గాంతురుగదా శ్రీసూ... 37

శా. ప్రావృట్కాలము దోఁచువేళ నసితాభ్రశ్రేణు
లభ్రంబునన్, భావింపం బ్రభవించుమాడ్కిఁదరి
తో నానా ప్రవృత్తు లదిన్, బ్రోవు లట్టి జనించుబద్ధు
లగుజీవు ల్యుక్తు లౌచున్ భవ, త్సేవన్ జేసి పడిన్
సుఖింతురు గదా శ్రీసూ... 38

మ. భ్రమ శుక్తిన్ గనుపట్టురాజతముపోలన్ దోఁచె
నీయందులో, కము లజ్ఞానసమృద్ధి నంచు బుధవర్గం
బెంచి తత్త్వప్రబో, ధము రంజిల్ల భవత్పదాంబు
రుహాముల్ ధ్యానించి నీలోన వా, రి మహాబ్ధిం
బలె నైక్య మొందును గదా శ్రీసూ... 39

మ. మృగతృష్ణ ల్మరుభూములంబలె భవల్లీలాస్వరూ
పంబునన్, జగము లప్పుడుఁ జూచి యజ్ఞుఁడు సదా
సత్యం బటంచున్ మృగం, బు గతిన్ నమ్మిభవాం
బురాశిఁ గడవన్ బోలేక తాపత్రయా, ర్తిఁగడున్
స్రుక్కుచు నిన్నుఁ జెందఁడు గదా శ్రీసూ... 40

మ. గరిపన్ వహ్ని జనించి తచ్ఛమనమున్ గావించు
నీరంబువై, ఖరిఁ జిత్తంబునఁ బుట్టి తన్మలినమున్
గన్పట్ట బాధించు మ, త్సరముఖ్యాగులఁ గూడఁ
బట్టి యపరోక్షజ్ఞానఖడ్గంబునన్, శిరముల్ ద్రుంచి
నవాఁడె ముక్తుఁడుగదా శ్రీసూ... 41

మ. అకలంకద్యునదీతరంగముల నుదగ్రత్వంకముం

బోలేఁ దా, కకారుణ్యముచేఁ దమం బణఁగి
సత్వం బుద్భవంబైనచో, నొకయద్వైతవిశిష్టవృ
త్తిఁ గనుచుఁ యోగప్రభావంబు దాల్చికడుఁ
భక్తుఁడు ముక్తి నొందునుగదా శ్రీసూ... 42

శా. కీలాలంబున బుద్బుదంబుగతి నగ్నిఁ ధూమముం
బోలెను, ద్వైలం బైతగు నీస్వరూపమున నా
విర్భూత మైనట్టిమా, యాలీలఁ గొని సృష్టి
రక్షణలయవ్యాపారము ల్సేయుచుఁ, గేలివృ
త్తి నెసంగునిన్నుఁ దెలుతుఁ శ్రీసూ... 43

మ. భువనంబుల్ ముకురంబునంబలె మదిఁ బోలేక
చూపట్టు నం, చవలోకింపుచు భక్తియోగమున
నార్యవ్రాత మత్యంతముఁ, భవదంఘ్రు ల్భజి
యించి సైంధవ ముదన్వద్వీచికం బోలె నీ, శిచ
రూపంబున నైక్యమొందును గదా శ్రీసూ. 44

మ. మధుమాసంబునఁ బుష్పరాజి వనసీమఁ బోలె
నీసత్కృపఁ, శిథిలీభూతతమస్కుఁడై సుగు
ణము ల్సేవింప నీసేవకుం, డధికోత్కృష్టనదీనద
ప్రతతి యయ్యాదోధిత్రోవఁ బలెఁ, పృథివిఁ
యోగపదంబు గాంచునుగదా శ్రీసూ... 45

శా. నీతేజఃపటలం బశేషభువనానీకస్థమై క్రాలుచో,
భీతిఁ గూటికిఁ జేరుఘూకమటులఁ విజ్ఞానసం

భావ్యమై, నీతత్త్వం బలరార నజ్ఞుఁ డెలమిన్
వీక్షింపఁ గాలేక నిన్, జేతోవీథిఁ దలంచి కొ
ల్చునుగదా శ్రీసూ... 46

మ. ద్విజరాజప్రభచే సుమార్గమటులన్ విద్యావికా
సోన్నతిన్, భజనీయస్ఫుటయోగవైభవగతుల్
భావింపఁ గన్పట్టుదా, నజనుం డుత్తమకాంత
నాథునిబలెన్ భావంబులో నిల్పి నిన్, సృజనా
ద్యేకమనీషుఁ గొల్చునుగదా శ్రీసూ... 47

మ. క్షితి సర్వజ్ఞత నీకు జీవునికిఁ గించిజ్జ్ఞత్వముల్
గూర్చియు, స్మృతి సమ్మాయ యవిద్యయున్ బె
రుగ నానావేషముల్ గట్టి మీ, రతులజ్ఞానస
మృద్ధి నేకమయి జన్మాదు ల్విసర్జింపుచున్, గృత
కృత్యవ్రతులై సుఖింతురు గదా శ్రీసూ... 48

మ. తమి శుల్బంబునఁ దోఁచుపాముకరణిన్ ద్వద్రూ
పమం దోలి వి, శ్వము గన్పించునటంచుఁ జిత్త
సరణిన్ భావింపుచో స్వప్నతు, ల్యములై లో
కము కాలముల్ క్రియలు కర్తల్ కల్లలౌనం
చుఁ గూ, రిమితోఁ దెల్పరె తత్వబోధకలితుల్
శ్రీసూ... 49

శా. లోకంబు ల్గల లోక్కభంగి మది నాలోచించు
తత్త్వప్రబో, ధాకల్పుం డటులన్ భవత్పదయు

గధ్యానోచితస్వాంతనా, లీకుం డెప్పుడు యుష్మ
దీయకృప కోలిఁ బాత్రుఁ డౌచుఁ సమఁ, త్సేకం
బొప్పఁగ ముక్తిఁ గాంచునుగదా శ్రీసూ...50

శా. వైరాగ్యంబును దత్వబోధమును శశ్వద్యోగ
ముం గల్గి సం, సారాసక్తిఁ దొలంగుచుఁ బుడ
మి నిస్సంగాత్ము లైనట్టివా, రారూఢాతురభావ
ముఁ గనుచు నందానందముఁ గాంచుటల్,
చేరఁ రానిభవత్కృపామహిమగా శ్రీసూ...

మ. క్షమయుఁ సత్య మహింసయుఁ సమతయుఁ
సర్వేంద్రియోత్థానముఁ, శమముఁ ద్యాగ
ము గల్గి నిశ్చలతపశ్శక్తిఁ బ్రవర్తింపలే,క మ
దిఁ భక్తి జనింప నీచరణసక్తధ్యానబుద్ధిఁ జరిం
చి మహానందము నొందఁ గంటి జగతిఁ శ్రీ
సూ... 52

మ. సగుణుం డంచును నిర్గుణుం డనుచు శాస్త్రజ్ఞుల్
వివాదింపుచో, సగుణవ్యక్తియె నీకు నిత్య
మయి సత్యస్ఫూర్తిఁ గనవట్టు కా,క గుణశ్రీక
లితుండవేని జగముల్ గన్గొంచు మెచ్చఁ ద
యా, దృగనీకావృతుఁ జేసి నన్నుపవే శ్రీసూ.

మ. శ్రుతిశాస్త్రంబు లెఱింగి బోధమహిమఁ శుద్ధాం
తరంగుండునై, మతిమత్సంగతి గాంచి యోగస

రణిఁ బన్నింపుచుఁ బోహమం, జతులప్రాగ్వి
ని నిష్ఠ జించు విబుధుం డంభోధి నప్పాయసా,
కృతి దోఁపఁ భవద్దైక్య మొందును గదా
శ్రీసూ... 54

శా. యోగస్యందన మెక్కి సత్త్వగుణసూతోపేతుఁ
డై యీషణ, త్యాగాస్త్రాసన మెక్కు వెట్టి హృ
దమోఘాస్త్రంబు సంధించుచుఁ, యోగు ల్మె
చ్చఁగనీవయిం బరపుమర్త్యం బట్టి నిర్వాణల,క్ష్మీ
గేహంబునఁ గట్టివైతువు గదా శ్రీసూ... 55

మ. మునిసభ్య ల్వెలుఁగంది చూడఁ దమితోఁ బూర్వ
క్రియాపాశముల్, గోని యాజ్ఞానపరంపరాయుప
నికఁ గొట్టాడఁగా నిల్పి జీవనికాయోచితసాల
భంజికల భాస్వత్ప్రీతి నర్తింపఁజే, సిన నిన్నెంచి
భజింప శక్యమగునే శ్రీసూ... 56

మ. జలధిఁ గ్రుంకినవాఁ డశేషతటినీస్నానవ్రతో
ద్భూతస, త్ఫలముఁ గాంచినమాడ్కి సర్వ
దివిషద్వర్యాకృతిఁ మించుని, న్నలఘుప్రీతిభ
జించువాఁ డఖిలదేవాగణ్యకారుణ్యదృ, ష్టిలతా
బద్ధముఖాబ్జుఁ డై తిరుగఁడే శ్రీసూ...

శా. సంతానద్రుమ మర్థికిం బలె నశేషస్వీయభక్తాళిక
త్యంతేష్టార్థ మొసంగు నిన్విడిచి యన్యాదిత్యు

నిం గొల్చుచుఁ, గ్రాంతిఁ భూపతిఁ జేరం
బోక సుభటుఁ బ్రార్థించువాఁ డట్టులఁ, జిం
తింపంగత మేమి మోహావశుఁ డై శ్రీసూ... 58

మ. మును నీపాదసరోజభక్తుఁడగు రాముం డా
ర్తవిప్రాంగనా, మునిదైతేయ వనాటముఖ్యుల
మదిఁ మోహంబు రెట్టింపఁగ, న్లోని కైవల్యపదం
బొసంగె భవదంఘ్రుల్ వేడ్కఁ జింతించువా
రి నుపేక్షించుట నీకుఁ బాడి యగునే శ్రీసూ.

మ. ధనదారాత్మజసక్తి లేక మదిలోఁ ద్వత్పాదపం
కేరుహ, ధ్యానముం గోరి యొనర్చువాఁ డెవ్వఁడు
దంచత్కర్ణరంధ్రంబులఁ, నిను నే కాలలులాయ
కంధరవిలంబిస్వర్ణఘంటావళీ, నినదాసహ్యాతదీయ
కంఠరవముఁ శ్రీసూ... 60

శా. శాంతిఁ గ్రోధము లోభ మస్థిరమతిఁ సత్సం
గతి స్మత్సరం, బంతర్మోహము దత్త్వగోష్ఠిని నిది
ధ్యాసప్రవృత్తి న్మదం, బెంతే కామము దేహధర్మ
కలనాదృష్టి న్విదారించి నీ, చింత న్వర్తిలువాఁడె
ముక్తుఁడుగదా శ్రీసూ... 61

మ. హరిసంరక్షణముఁ సుధాకరధరుం డంతంబు
సర్గంబు వా, క్తరుణీభర్తయు సల్పుటల్ బుధులు
వక్కాణింతు రాకృత్యముల్, పరమేష్ఠిప్రముఖా

కృతి ప్రముఖులు దోషపఙ్ జేతు మీవందు నెం,చిరి
వేదాంతవిశారదుల్ నిజముగా శ్రీసూ... 62

శా. నే నెంతే మదిఁ జింతఁ జెందుటకు నై నీ విట్టు
లంతంతనుఙ్, నానాసూనుధనాంగనాదిభవబంధ
శ్రేణి బంధించినఙ్, దీనత్వంబున భీతి గాంతు నె
భవస్ఫూర్తుయ్యందు మీఁదఙ్ సమీ,చీనస్ఫూర్తిఁ
బునర్భవంబు గను నే శ్రీసూ... 63

శా. నేనేరక్షుఁడ రక్షకుండ వెపుడుఙ్ నీవే యటం
చన్యులఙ్, గానంబోక భవత్పదాంబురుహముల్
గాంక్షించి సేవించుచుఙ్,నానా త్యాగముఁ జేసి
నాఁడ నిఁక న న్బాలింపకున్నఙ్ మనో,లీనాస్మత్ప
రితాప మెన్నవశమే శ్రీసూ... 64

మ. స్మరణం బెప్పుడు సేయుచుఙ్ మనుజు లస్మత్పా
వము ల్గొల్చినఙ్,గరుణం బ్రోచుదు వారి కెల్లనప
వర్గం బిత్తు నేనంచు మేల్,బిరుదోక్తు ల్వాచియిం
చు ని న్వేడిచి పేర్మిఙ్ బీదలఙ్ వేఁడఁగా, సిరి
లాభించునె ముక్తియుఙ్ గలుగునే శ్రీసూ ..

మ. అనుభోక్తవ్యముగాక కర్మసముదాయం బౌర
పోదంద్రు భూ,జను లెట్టైనను జన్మముల్ చనునె?
తత్పరంతుణార్థంబు ద, ప్పునె కృత్యంబులు
ముక్తిలభ్య మగునే ముష్మాలు నిన్నెంచి పల్కి
న వేదోక్తులు నిల్వకున్నె మృషలై శ్రీసూ...

శా॥ తూలంబై భవదాగ్రహంబున మరుద్గోత్రంబు
తూఁగాడున, త్తూలంబైన సుమేరులై నిలుచు
నీతూర్ణప్రసాదోన్నతిఙ్, గాలాదు లజనియింప
నెల్లజగముల్ గాపించి రక్షింతువా, రే లోకే
శముఖుల్ దద్వనువ్యలగుదుఙ్ శ్రీసూ... 67

శా॥ లోకంబుల్ గలిగింపఁ బెంపఁ జెరుపఙ్ లోలుం
డవై చిత్తమం,దాకాంక్షించినమాత్ర మక్షణ
మె సత్యస్ఫూర్తి వర్తించుచో, నేకాలంబు
రణేచ్ఛ మాన కెదురై హింసించుమందేహు లే,
చీకై కొంకలు వధ్యు లాదు*రుగదా శ్రీసూ...

శా॥ నీకారుణ్యము లేక ప్రాగ్భవకృతానిత్యక్రియా
రాశి బ్ర,ష్టాకారంబు పహించి మానవుల కత్యం
తార్తిసౌఖ్యోన్నతుల్, చేకూరంగ నటించు
తావకమరీచివ్యాప్తి లేకున్న ను, ద్రేకస్ఫూర్తిఁ
దమిస్రముల్ పెరుగవే శ్రీసూ... 69

మ॥ శితనారాచపరంపరఙ్ దెరల కక్షీణప్రతాపోన్న
తిఙ్, బ్రతిబాణంబుల నిఙ్ త్రికాలముల నొం
పఙ్ జూచు మందేహాదై, త్యతతిఙ్విప్రవిసర్జితా
ర్ఘ్యమహిమఙ్ దాఁటించి నీమంత్ర మూర్జిత
శక్తిఙ్ నిను మించి వర్తిలుఁ గదా శ్రీసూ...

---

* రభటుల్.

శా. పాపంబుల్ప్రచరించె నం చలుక నన్భావింప
వేమో కృపా, లోపంబున్ గనుపింప నీపదప
ద్మోరుద్భావనాసక్తి న, ప్పాపంబుల్గలవే య
పథ్యవికృతుల్ భైషజ్యసేవాగతిన్, తేపు న్వా
పును గాక యెట్లు నిలుచున్ శ్రీసూ... 71

మ. కపటప్రక్రియ సేవకున్ మనుప కే కాలంబు
నేకాకృతిన్, జపలస్వాంతులు కాక తావక
పదాబ్జాతార్చనల్ సేయు మం, చుపదేశించితి
వస్మదాదులకు నట్లూహింప శక్యంబె నీ,కృప
లేకబ్బునె ముక్తి పౌరుషగతిన్ శ్రీసూ... 72

శా. ఖిన్నుండై స్వభటుండు బ్రోవు మనుచున్ గేల్మో
డ్చిప్రార్థించుటల్, గన్నారం గనుఁగొంచు లేశ
మయినన్ గారుణ్యమున్ దాల్ప వా, పన్నత్రా
ణపరాయణుం డనుచు సంభావించి యామ్నా
యముల్, ని న్నెభ్భంగి నుతించి పల్కఁదో
డఁగన్ శ్రీసూ... 73

శా. నీవే దిక్కని నమ్మి వేఁడుకొనుచున్ నీదివ్యపా
దాబ్జముల్, భావింపం దొరకొంటి నన్నిఁక
దయన్ బాలింపు లేకున్నచో, దేవా! నాగతి
కేమి నిన్ను జను లుద్దేశించి నిందించినన్, సేవా
సంగతి నాలకింపవశమే శ్రీసూ... 74

మ.అనుకంపారసదృష్టి ము న్నఖిలభృత్యశ్రేణి రక్షిం
పవే, నను రక్షింపకయున్నచోఁ గలుగవే
నైర్ఘృణ్యవైషమ్యముల్, జను లెంచన్ సమవ
ర్తివై నిలిచి కాంక్షన్ బక్షపాతంబుఁ జేసిన
ని న్నుత్తములెల్ల మెత్తురె మదిన్ శ్రీసూ...

శా.యోగజ్ఞానవిరక్తి సత్త్వగుణసత్కీర్తిర్విసురశ్రేణి
కిన్, రాగం బొప్పఁగ ముక్తిసౌఖ్య మిడి నన్
రక్షింపకున్నన్ గృపా,యోగు ల్మెత్తురె బీదలన్
విడిచి భాగ్యోదారుల న్మన్నగాఁ, గ్రీఁగంటన్
గనుఁగొంచుఁ బ్రోవ నగునే శ్రీసూ... 76

మ. ద్విరదంబుల్ రథముల్ ధనంబులు మణుల్ తేజీ
లు రాజ్యంబు మం,దిరము ల్యాభపలు చేలము
ల్నినువడిన్ దెమ్మంచుఁ గాంక్షింప లే,దురుసంసా
రసముద్రతారణవిధానోద్యుక్తియుష్మత్పద, స్థిర
బుద్ధిన్ దయసేయు మంటి నెపుడున్ శ్రీసూ.

శా.ఏలా వేదపురాణశాస్త్రములు ని న్నేప్రొద్దు సేవిం
పన,బ్బాలేందుప్రభఁ జీఁకటుల్ బలె నఘవ్రాతం
బు నిర్మూలమై, వ్రాలన్ ముక్తిపదంబుఁ గాంతు
రనుచున్ వాక్రుచ్చె నే నగ్గతిన్, శీలం బొప్ప
భజింతు నీచరణముల్ శ్రీసూ... 78

మ.ఘనము ల్నీచము లైనజన్మములు మత్కర్మాను

కూలంబులై, వెనుకఁ గల్గినఁ గల్గనీ హృదయ
మే వేళఁ భవత్పాదచిం, తనముఁ దప్పకసల్పు
చుండుటకు నానోటఁ బ్రసాదింపవే, చెనఁటు
ల్లన్గాని చిత్తవీథి వగకఁ శ్రీసూ... 79

మ. తనువు ల్వీడుచు మున్నశేషనిరయస్థానస్థితా నే
కయా, తనలఁ బల్మి భుజించినాఁడ నిఁకఁ దద్బా
ధ ల్విజృంభించినఁ, గని చింతింపనుగాని నీభ
టుఁడ నానాదుర్గతుల్ చేరఁగాం, చెనటుండుఁ
జనులాడుచుండ వగతుఁ శ్రీసూ... 80

మ. నిగమాంతంబు లనేకరూపములచే నీతత్త్వ
మూహించుచోఁ, బొగడం జొచ్చితి మంద
బుద్ధి నకటా బోధ్యుండ వెట్టొదువో, తగ
బోధం బెటు లబ్బునో తెలియ దీతత్త్వంబు
గాంతుంచుచుఁ, మిగులం గొల్చెద నీపదంబు
లెలమిఁ శ్రీసూ... 81

మ. జననీగర్భగుహాంతరాళనిరయస్థానంబులం దున్న
యా, తన లొంక్కుమ్మడిఁ బాయునందు మదిలోఁ
దర్కించి నీపాదచిం, తనము న్మానక చేయు
చుంటి నిఁక నన్నారుణ్యదృక్సింధుపీ, చినికాయఁబు
నటింపఁ బ్రోవఁదగదే శ్రీసూ... 82

మ. శ్రుతిశాస్త్రంబులు సత్యమంచు భవదస్తోకాద్య

మంత్రంబు దు,ష్కృతపిచ్ఛేదక మంచు నీదుప
దముల్ సేవ్యంబులంచున్ దిర,స్కృతదేవుండవు
నీవటంచు మదిలోఁ జింతించి నిన్నాశ్రయ,స్తుతి
బంధం బెడఁబాపు మంచుఁ గొలుతున్ శ్రీసూ.

శా. కాయంబెల్లఁ గృశించె వాతకఫరోగం బెంత
యున్ దుస్తరం, బైయుండెన్ మఱికిన్ జడత్వ
మొకవేళ్ వ్యాపించెఁ జిత్తంబు దు,ర్వ్యామా
మంబుల నష్టము ల్దగతిన్ బ్రాసింప నీభృత్యు
నిన్, జేయన్ రాదె విదేహముక్తిఃలితున్ శ్రీ.

మ. జలజాతున్ గనకాంబరున్ సకలభూపాభూపి
తాంగున్ మహో, జ్జ్వలతూణాసిధనుర్ధరున్
గమనీసం సేవ్యపాదాబ్జుం బు, ష్కలతేజోనిధి
నాదేవు నిను సాక్షాత్కృ తిష్టాపంచున్ దలం,
చి లసద్భక్తి భజింతు మానసమునన్ శ్రీ...

మ. కలలోఁ దాఁచినచిత్తవృత్తులగతిన్ గన్పట్టు నజ్ఞా
నభూ,వ్యులు జీవుల్కటియించుకృత్యములు నీ వా
క్కింత కర్తృత్వబ,ద్ధ టంచున్ గని వారి క
న్యఫలముల్ దోడ్తోఁ బ్రసాదింప కర్మలిఁ బ్రోవం
దగదే యవార్యలనుచున్ శ్రీసూ... 86

మ. హరి తేజోమయ పద్మినీరమణ లోకాధ్యక్ష
పద్మాక్ష భా,స్కర మృత్యుంజయ శంకరా
శ్రుతిశిఖాసంభావ్య విశ్వంభర, సురవర్యా నిట

లాక్ష కేశవ మునిస్తుత్యాంఘ్రిపంకేజ సుస్థిర
సంజ్ఞారమణీశ లోకనయనా శ్రీసూ... 87

శా. ఛాయావల్లభ దుష్కృతాంతక మహేశా
భద్రసంధాయకా, ధ్యేయాకార శివస్వరూప
సుభటార్తిస్తోమ విచ్ఛేదకా, మాయాతీత ముకుం
దవాసరమణీ మార్తాండ నక్తంచరా, జేయా
ద్వాదశరూప చండకిరణా శ్రీసూ... 88

శా. అంతా దేవతలా హరిత్కరికరోగ్రాఖండదోర్దం
డసం, క్రాంతేష్వాసవిముక్తకాండజలధారాధ్వ
స్తమం దేహః, ల్వాంతవ్యక్తహుతాశనోజ్ఝితస
మస్తామర్త్య మర్త్యాళీ, చింతాసంతతి నిస్గణిం
చెదుతటిక్ శ్రీసూ... 89

మ. కలరే నీసరివేల్పు లిజ్జగములన్ గంగాధరాంభో
జభూ, బలభిద్వాసవముఖ్యనిర్జరశిరోభాస్వత్కి
రీటాగ్రభా, గలసద్రత్నసమంచిత శ్రుతిశిఖాగ
మ్యప్రభాభూషితాం, ఘ్రిలుఠత్సేవకభూరిదు
ష్కృతగణా శ్రీసూ... 90

మ. సరివేల్పెచ్చట లేఁడు నీకు శుచిమచ్ఛాస్త్రాగ
మాభ్యాసభా, సురవిజ్ఞానకళావిలోలహృదయ
క్షోణీసురాలోక్యదు, గ్ధగభానూత్కరచండమం
డలవినిర్యద్దివ్యరుగ్వారిత, స్థిరకాండోదరపూరి
తోరుతిమిరా శ్రీసూ... 91

మ. మెఱపుల్వాడ్పున సంపద ల్వొదలు నెమ్మేను
ల్ఘనచ్ఛాయలై, పరగుజ్ సంసృతిసౌఖ్యముల్
బహువిధస్వప్నంబు లై తోఁచు బంధురభోగం
బులు బుద్బుదంబులగతిజ్ బొల్పొందు నెవ్వా
ర ల, స్థిరరూపంబులు వీని నమ్మనగునే శ్రీసూ.

మ. శరణం బంటిభవత్పదస్మరణదీక్షావృత్తినూల్కొం
టి మత్సరమోహాదుల నంటకుంటి మతిమత్సాం
గత్య మిమ్మంటి నే, మఱుపా టెంతయుఁ గాన
కుంటిఁ దొలికర్మశ్రేణి పోఁగంటిఁ జెచ్చెరఁ దాప
త్రయిఁ బాపుమంటి నెపుడుజ్ శ్రీసూ... 93

మ. ధనలుబ్ధత్వము దిఱెఁగామముఖచేతశ్శత్రువుల్వా
ఱె సజ్జనసాంగత్యము మీఱెఁ బుత్రతతివాత్స
ల్యంబునుం జారెఁ దక్కినకాంక్షల్ గడతేఱె
నెల్లపుడు సత్కృత్యంబులెల్లజ్ ఘటించి నినుం
గొల్చితి నన్నుఁ బ్రోవవలదే శ్రీసూ... 94

శా. విత్తప్రాప్తిగతు ల్దలంపక సదా విద్యావినోదం
బునజ్, మత్తుండై దినకృత్యముల్ సలుపుచుజ్
మాన్యద్విజేంద్రాళిచేఁ, జిత్తస్థైర్యము గల్గి నీదు
పదముల్ సేవించుభూదేవుఁ డు, దృత్తిజ్
ము క్తిపదంబు గాంచును గదా శ్రీసూ... 95

మ. మనుజుం డర్థముఁ గోరి నీచరణముల్ మన్నింప

కర్థించుచున్, ధనికశ్రేణుల నాశ్రయించి పిదపన్
దైన్యంబు దీపింపఁ ద,న్నునయంబున్ జనులెల్ల
హాస్యములున్ సేయన్ బ్రాప్తి లేదంచు నేఁ,
చినవంతన్ బలుచింతఁ జెందుదుగదా శ్రీసూ...

మ. తనయుల్ తమ్ములు నన్నలున్ సతియు మిత్రశ్రే
ణియుం గొల్వఁగా, ధనికత్వంబునఁ దత్సుఖంబు
తనకున్ దక్కొల టంచున్ మనం,బున హర్షిం
చుచు మూఢుఁ డంతకభటుల్ పోరాడు వేళన్
జనిం,చినభీతిన్ గడుదుఃఖ మొందుదుగదా శ్రీ.

మ. నృపులం గొల్చుచు వేషధారి యగుచున్
బేరంబు లశ్రాంతమున్,జపలత్వంబునసల్పుచున్
పరగృహస్థానేచ్ఛ వర్తించుచున్, విపులద్ర
వ్యముఁగూర్చి మోహమున బృథ్వీదేవవంశ్యుండు
దాఁ,గృపణుండై చెడుఁ గాదె నిన్నెఱుఁగమిన్
శ్రీసూ... ౯౮

మ. కృతపాపంబులు లెక్కపెట్టక మహాహీనాకృతిన్
దాల్చి దా,నతతిన్ గైకొనుచున్ దురన్నముల
నంతఃప్రీతి భక్షించుచున్, వ్రతముల్ గోరక
యాహ్నికక్రియ లాగిన్ వర్జించి విప్రుండు సం,
చితవిత్తంబునఁ దృప్తిఁ జెందక చెడున్ శ్రీసూ.

మ. మతిమద్ధ్యేయు నచింత్యకాయు సుమహామా
యున్ రణాజేయు నిర్జితదైతేయు నతాదితే

యు ధృతకాంక్షేయుఁ జగద్ధేయు సం, భృతతి
గ్మాంశునికాయు సద్గుణగణామేయుఁ హ్రాతా
పాయు సత్కృతారాధేయు నహేయు నిన్నుఁ
గొలుతుఁ శ్రీ... 100

మ. ధృతచక్రాబ్జనిషంగచాపు విలసత్కీర్తిప్రభావంచి
తా, మృతసంతానకలాపు ఖండితభట శ్రేణీబృ
హత్పాపు ధీ, రతతి ధ్యేయసురూపు సత్యమధురా
లాపుఁ నతశ్రీపు వర్జితకోపుఁ సుకలాపు
నిన్నుఁ గొలుతుఁ శ్రీసూ... 101

మ. అవితాంభోజభవాండుఁ గిల్బిషకనత్కారణ్యవే
దండు దుష్టవిచిత్రార్జునకుండలద్యుతిసముద్యద్గం
డు మందేహదా, నవసేనాదళనోన్ముఖప్రబలనానా
కాండుఁ గాండాదిభూ, రివిహారార్హపిచండుని
న్నుఁ గొలుతుఁ శ్రీసూ... 102

మ. నతశక్రాదికిరీటకోటిమణిసంతానస్ఫురత్పాదుదా
రితభక్తాఖిలఖేదు మానిజనతాశ్రీదుఁ మహా
మోదు బాలితమన్యదు విపక్షహృద్భయద
మార్వినాదు దివ్యాస్త్రని, ర్జితనానాపలలాదు
నిన్నుఁ దలఁతుఁ శ్రీసూ... 103

మ. సురవన్యస్తుతనాము భవ్యసుగుణస్తోముఁ సమ
స్తాశ్రితో, త్కరసంతాపవిరాము లోకభయకృ
త్సంగ్రాము నానావిధా, భరణోద్దాము సుధాము

సత్కులసరస్వతోస్సేము నిష్కామము భూరిరమా
లంకృతధామము నిన్నుఁ దలఁతున్ శ్రీసూ...104

మ. శతపత్త్రాయతనేత్త్రు సర్వసుమనస్సంస్తుత్యచారి
త్త్రుఁ దు, ష్కృతసంఘాతలతాలవిత్త్రు మునిరాడి
ష్టాటవీచైత్త్రుని,ర్జితమందేహనిశాటగోత్త్రుఁగిరణ
శ్రేణీలసద్గాత్త్రు సం,శ్రితలోకావనసూత్త్రు నిన్నుఁ
దలఁతున్ శ్రీసూ... 105

మ. కుతుకం బొప్ప నమస్కరింతు మఱి నీకున్ సేవక
శ్రేణికిన్,ధృతదివ్యాయుధపాణికిన్ మణిగణో
దీర్ణప్రభాపుంజరం,జితగాంగేయశతాంగమాలికి
సరోజిన్యాదికాంతాళికిన్, గృతకృత్యుం డని
వేడ్క నన్నుపవే శ్రీసూ... 106

శా. ఈమీఁదన్ భవదీయభూరిదయ నే నెంతే
సుఖశ్రేణిచే, నామోదించి నిరామయప్రకృతి నై
హర్షించుచున్ బాపచిం,తాముక్తిం గని ముక్తి
కాంక్ష మదిలో స్తంభింప నీపాదముల్, వేమా
రెంచి భజించుచున్ దిరిగెదన్ శ్రీసూ... 107

శ్రీసూర్యనారాయణశతకము సంపూర్ణము.

# పీ ఠి క.

ఈశతకము రచించినది కొమఱ్ఱాజు వేంకట శివుఁడని గ్రంథాంతమునఁగలపద్యమువలనఁ దెలియు చున్నది. ఈ వేంకటశివునివ్యవహారనామము వెంకట ప్పయ్య యనియు కృష్ణామండలములోని పెనుకంచి ప్రోలువాస్తవ్యుఁడనియు ఆంధ్రవాఙ్మయమునకు జీవకళల బ్రసాదించిన కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణ రావు, ఎం.ఏ, గారికీకవి జనకుఁడనియుఁ దెలియు చున్నది.

వేంకటశివుఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు.లింగ ధారిమతములోనివాఁడు. ఉద్భటారాధ్యవంశపరంప రలోని యారాధ్యులీకవిగురుకుటుంబములోనివా రు. ఈకవి మునగాలసంస్థానప్రభుత్వము గావించి యిప్పటిమునగాలప్రభువులగు శ్రీనాయని వేంకటరం గారావు బహద్దరువారిని దత్తులుగాఁ దీసికొనిన లచ్చమ్మారావుగారివద్ద మంత్రిగానుండి చిరకాలము రాజకీయవ్యవహారములలోఁ బాలుగొనెను. ఈకవి మఱి కొన్ని శతకములు జ్యోతిషగ్రంథములు రచిం చినట్లుల శతకకవులచరిత్రము పేర్కొనుచున్నది గాని యాపుస్తకములనామములే తెలియవచ్చుటలేదు. అందులకుఁ బ్రయత్నించి కృషి చేయవలసియున్నది.

ఈశతకమునఁ బేర్కొనఁబడిన రాజలింగస్వామి రేపాలలోని యర్చాదైవతము. రేపాల మునగాల

సంస్థానములో మునగాలకు ఐదుమైళ్ల దూర ములో నున్నది. విచారింప నాయూర గ్రామలింగ స్వామిదేవళము గలదని తెలిసినది. కవి వీరశైవుఁ డై నకతన రామశబ్దసహితముగ లింగశబ్దము నుచ్చ రింపనొల్లక రాజలింగమని పేర్కొనినటులఁ దోఁచు చున్నది. మతావేశపరవశు లిటులఁ జేయుటలో నించుకేనియు వింతలేదు

ప్రకృతశతకము నూటయిరువదియేడు సీసపద్య ములతో నిండియున్నది. శతకకవిత ధారాశోభి తమై సులభసాధ్యమగు భాషలో మృదుమధుర ముగా నున్నది. అందందు వ్యాకరణదోషములు గూడఁ గలవు. వేంకటశివుఁడు మతావేశము గల వాఁడగుటచే నీశతకమున శివునికంటె దైవము లేడనియు నితరదైవతములు శివభక్తులనియు నీశ్వ రశబ్దవాచ్యుఁడగు శివుఁడే నిఖిలదేవస్తుత్యుఁడనియు భస్మము రుద్రాక్షలు బ్రాహ్మణులు ధరించితీరవలెన నియుఁ గొన్నిపద్యములలో బోధించెను. మఱికొ న్నిపద్యములలో స్కాందాదిపురాణములనుండి వి షయసంగ్రహము గావించి శివపరేశ్వరత్వము పలు మాఱు స్థాపింప యత్నించెను. గంగ విష్ణుపదోద్భ వియనునంశము, బ్రహ్మతలఖండించుటచే శివునకు బ్రహ్మహత్య వచ్చినదనువిషయము శివుఁడు మోహి

నిని జూచి యపభ్రంశముగ వర్తించెననునంశము భస్మాసురకథ సహజమతాభిమానము నాధారపఱచి కొని ఖండించినాఁడు. శివునకు నీశ్వరత్వమారోపించుటయే కర్తవ్యముగాఁ బెట్టుకొని యీకవి పలుతావుల నితరదైవతదూషణము బ్రహ్మశాఖలలోఁ జేరినయితరులనింద విరివిగాఁ గావించియున్నాఁడు.

పరమతనిందాగర్భితముగ శ్రీగిరిమల్లేశ, వీరభద్రశతకాదులు రచించిన కొమఱ్ఱాజు రామలింగకవి యీవేంకటశివునకుఁ బినతండ్రి యగుటచేఁ గాఁబోలు అన్యదైవదూషణమునఁ దండ్రినటులుండును నుచున్నాఁడు. మొత్తముమీఁద నీరాజలింగశతకమును వీరశైవమతసిద్ధాంతబోధకమని చెప్పవచ్చును. ఇందు బసవేశ్వర, సోమనాథ, మల్లికార్జునాది వీరశైవులు నెలకొల్పిన సంప్రదాయములు లక్ష్యమునందుంచి వ్రాయఁబడినపద్యములు పెక్కులు గలవు. శైవమతప్రతికూలురు కొందఱు పురాణములలో శివునకుఁ గలయీశ్వరత్వము లోపింపఁజేయుటకుఁ గొన్నికల్పితకథలుఁ జేర్చిరనియు భాగవతమునఁ బోతరాజునైతము విష్ణుమతాభిమానవశమునఁ గొన్ని శివప్రాముఖ్యముఁ దెలుపుకథలు లోపించెనని యీక్రిందిపద్యములోఁ దనయభిప్రాయము దెలిపియున్నాఁడు.

సీ. భాగవతంబునఁ బాత్రికుఁ డైన కవి
వాస్తవంబులు కొన్ని వదలినాఁడు
... ... ... ...
దక్షాధ్వరమునకు దనుజారి వచ్చిన
లేదని చెప్పెను
... ... ... ...
క్షత్రియుఁ బలుకుట పోతన చూడఁడే మొ. (చూ. ౧-౨-౨)

ఇటులె మతావేశములగు సంశములకు నితరమ తనిందలకుఁ దారకాణలు కాంచనగును. కేవలమత ధర్మములు దెలుపుశతకకదంబములో నీశతకమొకటి యైయున్నది. చిరకాలముక్రింద నీశతకము తప్పుల తడికగా ముద్రింపఁబడి యుంటచేఁ గవిభావాను సారముగఁ గొంచెము సవరించి శుద్ధప్రతి సిద్ధప ఱచి యీశతకము ప్రచురించితిమి.

ఈశతకకర్త రమారమి 40సంవత్సరములక్రిందట లింగైక్యము నొందెను. శైవమతోద్బోధకమగు అన్యవాదకోలాహల మంతప్రౌఢముగా నీశతకము లేకున్నను ఇందలిపద్యములు సుబోధకములై మతా వేశమున కనుగుణముగ నుద్రేకకరములుగానున్నవి. ఈకవి యితరగ్రంథములకొఱకాంధ్రులు యత్నించిన వీరశైవమతగ్రంథమండలికిఁ దోడ్పడినటు లగును.

నందిగామ.
1-1-26

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

ఓమ్.

కొమ్మర్రాజు వేంకటశేషకవిప్రణీత

# రేపాల రాజలింగశతకము

---

సీ. శ్రీగిరీశ్వర నీదుసేవ ముక్తికి త్రోవ
నీనామ మఘవార్ధి కిల్చునావ
నిరులిచ్చు చెలిఁబొందఁ జేసెఁగా నీభావ
త్రిపురవాసులఁ ద్రుంచు తెలివె శేవ
మునిపుత్త్రు మొఱ విని చనితివో దయఁ గావ
మానవులఁ గొట్టు మూటలావ
చలిమలసుత నేలఁగలవాఁడవే నీవ
వేల్పులు జాలిరే విషము ద్రావ
గీ. సకలసురలందు బ్రాహ్మణజాతివీవ
చావుపుట్టుక లేకట్టిసామి గావ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ
రాజితశుభాంగ రేపాలరాజలింగ. 1

సీ. నీవు బట్టినవిల్లు నేటైనబల్ గట్టు
పసమీఱు మీనారి బుసలగొట్టు
నీజటాజూటంబు నిల్వ గంగకుఁబట్టు
నలుమేను పార్వతికైనదెట్టు
నీరథచక్రముల్ నిలుపకరుగు రట్టు
నీముఖంబున కగ్ని నీటిబొట్టు

నీగళచ్ఛాయకు నీగును చలినట్టు
విను నీనివాసంబు వెండిచట్టు
గీ. మట్టుమీఱెనె నీచర్యలెట్టు కట్టు
పఱచి వాక్రుచ్చఁగను బల్లపడుటదెట్టు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 2
సీ. చలిమలసుత నీకు పలసినపెన్ రాణి
ముసలియెద్దే మీకు మిసిమి ఘోణి
ఆకాశమే మీకుహాళ్ళుర్యమగువేణి
చాలదు మీకథల్ జదువ వాణి
అంబరంబయ్యె మీ కఖిలదిశాశ్రేణి
పరమేశ మీకయ్యె శరధితూణి
భక్తసంరక్షణాస్పదమగు మీపాణి
తలఁప మీపిన్నాలు బలుపతాణి
గీ. లీల గణియింప వేదములేనిరాణి
మీకరంబునసున్న దే మేలిమైణి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...3
సీ. నొసలికన్నాకకు బుసబుసమనునిల్లు
కన్నొడినార్పుపై గంగబల్లు
సగముజేసెఁగదయ్య సత్తి నిన్ బల్ పెల్లు
తలకెక్కె మరుగాలు తగని.గొల్లు
వంచితే వంగక దెంచినఁ దెగువిల్లు
గండిగా వలపటిబండికల్లు

పెద్దకొమరునకెట్లు పెండ్లిగానిదిగుల్లు
దండిపాములపొత్తు గుండెఝల్లు
గీ. ఇట్టిగృహభార మహహ మీకెట్టు జెల్లు
చున్నదో కద జేరు మాయున్నయిల్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 4

సీ. కల్పవృక్షము గొప్పకలముగాఁదగె నోయి
యంబుధిజలము లేనయ్యె † శాయి
భూమిఖండము లె సంపుటముగాఁ బడె హాయి
వనజసంభవురాణి వ్రాయుతాయి
మీచరిత్రంబులు మించినవామ్నాయి
సంపూర్తి లిఖియింపఁ జాలదోయి
ఇతరులు లేఖనకెత్తుదురే చేయి
శక్త్యనుగుణనుతుల్ జేయమాయి
గీ. ఇవియు ఘనముగ శుభముల నిమ్ము భాయి
బ్రోవవలె గాక దయబేర్మి భావయాయి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...5

సీ. బసవపురాణంబు బండితచారిత్ర
యనుభవసారంబు నఖిలశ్రుతుల
సహితచతుర్వేదసారంబు సోమేశ
భాష్యసద్గ్రంథముల్ సవ్యరీతి

---

† శాయి=సీరా.

రచనాధికారి వై రయమొప్ప పరవాద
భీకరుండనఁగను బృథివిలోన
రుద్రుఁడయ్యు బ్రతాపరుద్రునిసభ విష్ణు
వాదుల నోడించి వారికెల్ల
గీ. శైవదీక్షలొసంగిన శంకరుండు
పాల్కురికిసోమునకు నేను బ్రణుతిఁ జేతు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...6
సీ. బసవాద్యసంఖ్యాత్యభక్తులఁ గొనియాడి
విఘ్నేశ్వరునిఁ జాల వినుతిఁ జేసి
వరదధీచ్యాదులఁ గరమొగి గణుతించి
నూతనశివభక్తనుతి యొనర్చి
నీమీఁదభక్తిని నేనేర్చినట్టులఁ
జెప్పఁబూనితినయ్య సీసపద్య
ములు గాన నిర్విఘ్నముగ జేయఁగా మీరె
కర్తలు తప్పులు గలిగియున్నఁ
గీ. బరసవేది యయస్థితిభర్మమైన
పగిది మత్కావ్య మిల శ్రేష్ఠమగునుగాక
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...7
సీ. శంకర పరమేశ శాశ్వత సర్వేశ
కాలకాలాంతక గరళకంఠ
చంద్రశేఖర భీమశాంకరీహృదయేశ
శర్వ మహాదేవ శరనిభాంగ

ఫాలనేత్ర గిరీశ పంచాక్షరీరూప
భవహార పురహార భక్తవరద
గంగాధర సురేశ కంజాక్షసన్నుత
భుజగభూషణ దీనపోష సోమ
గీ. యనుచుఁ బఠియించువారికి ఘనతమీఱ
మోక్షసత్రంబు లేసినదీక్షనీదె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...8
సీ. వేల్పులంకతిలోన విప్రుండ వీవని
సకలవేదంబులు చాటుచుండు
కమలాక్షసుతు నీదుకంటను సమయింప
బ్రతికింపఁగలిగెనే బాలు నతఁడు
కమలాసనునితల ఖండించితివిగదా
మొలపించుకొనుశక్తి గలదె తనకు
గరళము భక్షించుతరి పంచియిమ్మని
పరివేల్పు లీకొనఁజాలి రెవరు
గీ. పశుపతివి నీవు సురలంతపశువులగుట
కివియె సాక్ష్యంబులగునయ్య భువనములకు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...9
సీ. సర్వేశ త్రిపురముల్ సాధించుపనికైన
సాధనంబులు వ్యర్థసాధనములు
ఫాలానలకరాళలీలలచే రిపుల్
మ్రగ్గికూలిరి ధర బొగ్గులగుచు

రథము గుఱ్ఱంబులు రథసారథియు ముల్కి-
నుండిరైయెనది కార్య మొండు లేదు
అధికారము లోసంగుకథఁజూడ వారల
మన్నించువిధముగా నెన్నఁదగును
గీ. దేవదేవ మహాదేవ శివిజరాజ
నామకుఁడ వీవె యితరుల నేమి చెప్ప
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత. 10
సీ. విధికపాలంబును వింతగాఁ బేరులై
చాల మీయురమున వ్రేలుచుంట
మీనకూర్మవరాహమానవహరివామ
నం బన నైదుజన్మంబులందు
శౌరిని శిక్షించి శరణన్న రక్షించి
కొమ్ముకర్పరయును గొమరు దొంష్ట్రి
మును చర్మకోలెమ్ము నృష్టమౌగుర్తులు
గాఁగ మీరుధరింపఁ గలిగియుంటఁ
గీ. జావు పుట్టుక లేనట్టిస్వామి వగుట
కివియె సాక్ష్యంబులై లేవె భువనములకు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గ్రామాధికారిని గని యాశ్రయించిన
దేశవివాదలు దీర్పఁగలఁడె
దేశాధికారిని దినమాశ్రయించిన
లోకవాదముదీర్పు జోకఁగలఁడె

లోకాధికారిని నీకు మ్రొక్కెదనన్న
సర్వేశుపగిది యీయఁజాలఁగలఁడె
తమతమయధికారతారతమ్యంబులఁ
గొలఁదిగా ఫలమీయఁగలరుగాక
గీ. పశుపతిత్వముగల మీకు బలెను పశువు
లైనసుర లోపఁగలరె నెద్దానికైన
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత ...
సీ. బాదరాయణి తాను వారణాసీస్థుల
శపియింపఁదలఁచిన చంద్రమౌళి
కోపించి పొమ్మన్నఁ గ్రోధియై ప్రతికాశి
కట్టినఁ జెడియె నాకాలమందె
పద్మపురాణంబు బల్కెనాఁ డొకకొంత
వ్యాసకాశీఫలవ్యాప్తినొందె
నని స్కాందమునఁ గన్నదదియుఁ గాదని రేని
వైష్ణవులైనను వ్యాసకాశి
గీ. లోనఁ జావంగఁగోరరు మానుషంబె
హరియట వ్యాసుఁడనఁగను హర్షపడరొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...18
సీ. హరవృషమధ్యంబునందుండి వ్యాసులు
భుజములెత్తి ప్రమాణపూర్వకముగ
నారాయణునకన్న వేఱెదైవములేడు
ముమ్మాటికినియను మూర్ఖమతిని

నెత్తిన బాహువు లెత్తినట్లుగ వాక్కు-
స్తంభనంబైనచో స్థైర్యమెడలి
ప్రార్థింప హరివచ్చి పరమేశ్వరుఁడు తన
కర్తగాఁ జెప్పినకారణమున

గీ. విశ్వనాథుని గొనియాడి విగతభయుఁడు
డయ్యె నని జెప్పె స్కాందంబు నమితముగను
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత... 14

సీ. దారుకావనఋషుల్ దైవంబు లేఁ డని
గర్వించినను వారికి నేర్పరింప
హరిభార్యగా మీరు నానుబిపల్లెరు
వచ్చి నిర్వస్త్రులై వారిమునిము
లుభయులు దొంగిలి నోర్చక ఘర్షించి
వ్యర్థప్రయత్నులై వారు బ్రహ్మ
కడ కేగి చెప్పినఁ జెడితిరి వారలు
హరిహరులనవిని యాంశవచ్చి

గీ. శౌరిపీఠంబు లింగంబు మీరుగాఁగఁ
దలఁచి లింగార్చనలు జేసి ధన్యులైరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. పద్మనాభుండును బ్రహ్మజుండునుగూడ
ఘర్షించుకొన వారికలహందీర్ప
దేజోమయంబైన దివ్యరూపంబునఁ
దోఁచితి రది చూచి తోయజాక్షుఁ

డరిగె పదముగన శిరముజూడఁగ బ్రహ్మ
నడచెను గనలేక వెడలివచ్చి
నిజకరిత్రయె విష్ణు నిన్ను మెప్పించెను
నిజములాడక విధినిందితుండు
గీ. నయ్యె భువిఁ బూజలేకుండ నయ్యె మొగలి
రేకు మీపూజ కర్హంబుగాకపోయె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గతజన్మమున మిమ్ము మతిఁదలంపమి తప్పు
తప్పునియీజన్మ తనకుఁజెప్పు
నిప్పుడు మిముఁ గొల్వ నెత్తెఁగిలి నిదిముప్పు
ముందుజన్మంబున మొదలెముప్పు
పుట్టుటలేకున్నఁ బూజలే దదితప్పు
తప్పులుమూఁడు నాతలన నొప్పు
తప్పులొప్పులుగాఁగ దయసేయుటె మెప్పు
భక్తసంరక్షణాస్పదుఁడ వెప్పు
గీ. డఖిలలోకేశ సర్వేశ యఘవినాశ
నీటనెత్తుము పాల నేనేటనొత్తు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. లూతయేవేదంబు లూతగాఁజదివెను
శాస్త్రముల్ భుజగ మేచాయజూచె
గజరాజు యేవిద్య గష్టతనేర్చెను
ఎలుక తా నేమంత్ర మెంతజేసె

కాటకోటం బెట్టికవితఁ జెప్పఁగఁజాలె
గోడగూచి యేనీతిఁ బోడమి పెరిగె
నిమ్మవ్వ యేపాటిసొమ్ము నీ కిడెనయ్య
సాంఖ్యతొండఁడు యోగసరణిఁ గనెనె
గీ. కావు ముఖ్యంబులివి భక్తకారణముగఁ
దలఁప మీకృప మోక్షంబు గలిగెగాని
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఘనమృకండజుపైని గల్గినప్రేమయు
గన్నప్పయందలి గౌరవంబు
బసవేశ్వరునియందుఁ బ్రకటమౌ మీదయ
చెన్నబసవనిమీఁదఁ బన్ను కరుణ
పాల్కురిసోమేశుపైఁ బద్ధదృష్టియుఁ
జేరమరాయుపైఁ జెలఁగుకృపయు
మలహణకవిపయి మన్ననగరికాల
చోళరాయనిపైని దాళుజాలి
గీ. గూడనామీఁదనుంచు మేజాడనైన
నేఁడు మీపాదములు విడనాడఁజాల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఫక్కియందును రెండుచక్కనిబొల్లిని
శూలచక్రము లొక్కజాలుగలవి
గొల్లప్రేతల మానికుంజరపతులను
జెలిపినా రిద్దఱు శిశువొకటె

ఆలిపై యాండ్లను నార్జించుపనికిని
నుభయలచిత్తంబు లొక్కరీతె
సురలరక్షింపను నరభోజనులఁ జంపఁ
బూనినారిరువురిపూన్కి సరియె
గీ. చావుపుట్టుక గలిగినసామిశౌరి
చావుపుట్టుక లేనట్టిసామివీవు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్ర పఠనంబు పఠనంబు
పరమేశునందలిభక్తి భక్తి
శివునిబూజించెడిచేతులు చేతులు
కరకంఠునకు మ్రొక్కు శిరము శిరము
శ్రీగిరీశ్వరుజేర్చు చిత్తంబు చిత్తంబు
శ్రీగిరిజాధీశు సేవ సేవ
భవుభక్తవరులది భజనంబు భజనంబు
వామదేవునుతించువాక్కు వాక్కు
గీ. అనుచుఁ దెలియక కొందఱు నఘము లితర
మార్గములఁబోయి పుట్టుచు మడియుచుంద్రు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఇక్షుఖండంబున కెన్ని వంకరలున్న
దానిమాధుర్యంబు దరుగనట్లు
గంగోదకంబులు గలుషంబులై యున్న
జలమహాత్మ్యం బేమితలఁగనట్లు

గోవుపొదుగున నెన్ని గోమారులుండిన
క్షీరంబులకు రుచి చెడనియట్లు
బాలుని వవ్యక్తభావులై యుండిన
జననిజనకుముద్దు ప్రగ్గనట్లు
గీ. మత్కవిత్వంబునను తగ్గుమాటలున్న
భక్తిరసమధురంబు లోపంబుగాదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దీర్ఘాయువులు లేవు స్థిరమతులా లేవు
లేవు శాస్త్రజ్ఞానభాగవతులు
దుశ్చరిత్రలుపోవు దొంగనీతులుపోవు
పోదు కామక్రోధపుంజ మెపుడు
యాగంబులా లేవు త్యాగంబులా లేవు
లేదు సత్సంగతి లేశమైన
పాపంబులాలావు వాపోకలాలావు
లావుకు జన సేవ లతివిధుల
గీ. కలియుగంబిది యీరీతి ఘటనపడెను
యోమహాదేవయన బ్రోవవా మహేశ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అఱువది వేలేండ్లు నాయువు తండ్రికిఁ
బదియు నొక్కటివేలు బ్రతికెఁ బట్టి
ముగురుభార్యలతోడఁ దగసుఖించెను దండ్రి
కొడుకు పత్నికుఁడై కుతలమేలె

తండ్రిస్వర్గముకేగి దనుజులమర్దించె
భూమిలో దశముఖు బొడిచె గొడుకు
ఆదియుగములయందె యాయాయితరముల
తారతమ్యత యెంతొ తక్కువయ్యె
గీ. నాయురర్థబలంబులు నంతకంత
కవనిఁ దగ్గుట కాశ్చర్య మరయ లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. వాలినిఁ జాటుగాఁ గూలనేసినతాన
నెలుకవ్రేటున శౌరి యెగురవలసె
బలినంటఁగట్టినపాపంబునకు రాముఁ
డరిపాశబద్ధుఁడై యడలవలసె
కురురాజకొడుకులఁ గూల్చినయఘమున
హరికులక్షయుఁడౌట జరుగవలసె
మునిపత్నిహత్యకై మురవైరి జగతిలోఁ
బుట్టుచు బెరుగుచు గిట్టవలసె
గీ. నంతవారికిఁ గృతకర్మ మనుభవంబు
గలిగె నింకెవ్వరికిఁ దప్పఁగలదు కర్మ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శ్రీకృష్ణుభార్య లంచితగుణ లెనమండ్రు
భర్తపోయినమీఁద బ్రతికి రకట ?
గోవిందుపిమ్మట గోపికలందఱు
బోయలకవగూడఁ బోయి రకట?

శ్రీహరిచేఁ గర్మ చేయుప్రాప్తము లేక
వసుదేవుఁ డీల్గఁగావలసె నకట!
పాండవుల్ శౌరికి బంధులు భక్తులై
కడ యమదుఃఖముల్ గాంచి రకట!
గీ. అంతవారికిఁ గృతకర్మ మనుభవంబు
గలిగె నింకెవ్వరికిఁ దప్పఁగలదు కర్మ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అవిముక్తమందుండు నర్హుండుగాడని
శర్వుచే వ్యాసులు శప్తుఁడయ్యె
బృంగను జెఱచినవృత్తికి రాములు
సీతావియోగతఁ జెందవలసె
ననుజను మోహించునఘమున బుద్ధుండు
కాళ్లుజేతులు మొండిగాఁగవలసె
గౌతముభార్యను గామించి సురరాజు
తనువెల్ల యోనులై మనఁగవలసె
గీ. నంతవారికిఁ గృతకర్మ మనుభవంబు
గలిగె నింకెవ్వరికి తప్పఁగలదు కర్మ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బ్రాహ్మణ్యమునకుఁ దగు భస్మధారణయును
భస్మోపనిషదర్థఘణికిఁ గనరొ
వ్యాసవాల్మీకులు వారిగ్రంథంబులు
భసితమాహాత్మ్యంబుఁ బలుకుటెఱుఁగ

రో॥ యాగమంబులు వాయాడ భస్మము
గొనియాడుచుండుట మనసురాదొ
వేదముల్ స్మృతులును వేవిధంబుల భస్మ
ధారణ ముఖ్యమఁటదారి వినరొ
గీ॥ జగతి విప్రులు గొందఱు నిగమ మెఱఁగి
భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ॥ ముఖబాహుజులకును సుఖము త్రిపుండ్రంబు
వైశ్యుల కగుజుమీ వర్తులంబు
నర్ధచంద్రునిరీతి హర్షంబు నాలవ
జాతి యితరులకెల్ల భాతి యూర్ధ్వ
పుండ్ర మంచని భస్మ బూయువిధంబులు
బహుగ్రంథములయందుఁ బలుకఁబడియె
నన్యజాతులకైన నాయూర్ధ్వపుండ్రంబు
భస్మచే ననిగదా పథముగలిగె
గీ. జగతి విప్రులు గొందఱు నిగమమెఱఁగి
భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఉపనీతుఁడగువేళ విపరీతమేదయా
భువి నాందిముఖవిప్రభోజనంబు
భస్మధారణ గోచి పంచశిఖల్ మౌంజి
దండంబు భిక్షయుఁ దనర భర్గ

మంత్రోపదేశంబు మఱి యగ్నిముఖమున
గడ చేయునవి దీనిక్రమముచూడ
రుద్రచిహ్నలఁజేసి రూఢిగా ద్విజుఁడయ్యెఁ
గానిచో బ్రాహ్మడుగాఁడతండు
గీ. జగతి విప్రులు గొందఱు నిగమమెఱిఁగి
భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఉపనయనాగ్నియం దుండుభస్మముఁ దాల్ప
కుండిన సిద్ధిలేకుండు నగ్ని
వైశ్యదేవాగ్నిలోపల నుండుభస్మంబు
ధరియింపకుండినఁ జెడును కర్మ
ప్రేతకార్యములందుఁ బెట్టంగవలె భస్మ
బెట్టకుండినఁబ్రేత తిట్టఁగలఁడు
క్రతుకర్త యగువాఁడు క్రమముగా భస్మంబు
దాల్పఁడేనియు సేయఁదగఁ డతండు
గీ. జగతి విప్రులు గొందఱు నిగమమెఱిఁగి
భస్మ ధరియింప రెట్టిదౌర్భాగ్యగుణమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...81
సీ. వాల్మీకి కుంభజ వాసిష్ఠ గౌతమ
వ్యాస పరాశర వామదేవ
పర్వత దూర్వాస భరత మార్కండేయ
కణ్వ దధీచ్యాదిఘనమునులును

విధి విష్ణు రవి చంద్ర బుధ బృహస్పతి శచీ
పతి ముఖులగునట్టిపరమ సురలు
బలి బాణ రావణ బహుళేంద్ర తారక
శూర పద్మాసుర సోమ హరులు
గీ. భస్మ ధరియించి రని గ్రంథబహుళమున్న
వినియు దెలియరు కొందఱే వెఱ్ఱియే మొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భస్మనిషేవణ భస్మధూళనములు
భస్మధారణమునఁ బరగుమూఁడు
విధులలో స్నానంబు వెనుకజన్మాఘముల్
మొదలంట జెడుటకు ముఖ్యమగును
తనుగుణంబులదోషతతి నణంగింపఁగాఁ
జాలు నుద్ధూళనసంజ్ఞక్రియయు
వేధదుర్లేఖలు వెడలింప మోక్షంబు
లొసఁగ ధారణకును బొసఁగుశక్తి
గీ. భస్మమునుగూర్చి దగుగ్రంథబహుళమున్న
వినియుఁ దెలియరు కొంద ఱే వెఱ్ఱియే మొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భూతభేతాళముల్ పారిబుచ్చఁగలశక్తి
బ్రహ్మరాక్షసులను బట్టుధాక
కామినీగ్రహములఁ గనిరవ్వఁగలఠీవి
మోహినీగ్రహముల ముందునూహ

వీరవైష్ణవు లెట్లు జేగరానిమహాత్త్వ
జైనబౌద్ధులద్రుంపఁ జాలుగుణము
శాకినుల్ ఢాకినుల్ జడిసెడి రౌద్రంబు
శివభక్తులకు సిరుల్ సేయుగరిమ
గీ. భస్మముకె కాక యొంటికి కీపగిదిగలదె
వినియు దెలియరు కొంద ఱీవెఱ్ఱియేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. తపసియై వనముకుఁ దర్లిపొయ్యేవేళ
దాశరథియు భస్మధారియయ్యె
మోక్షార్థియై శైవదీక్షఁగొన్నప్పుడు
దాశరధియు భస్మధారియయ్యె
రామలింగము నిల్పఁ గామించినప్పుడు
దాశరథియు భస్మధారియయ్యె
అశ్వమేధముఁ జేయునవసరంబందున
దాశరథియు భస్మధారియయ్యె
గీ. వ్యాసవాల్మీకకావ్యముల్ వసుధలేవె
చూచియుఁ దెలియఁజాల రిచోద్యమేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...85

సీ. భస్మంబు ధరియింపఁ బాపముల్ విడిపోవు
భస్మంబు సిరులీను పరసవేది
భస్మంబు రోగార్తిభంజనకరమగు
భస్మంబు వైరులపట్టుఁ జెఱచు

భస్మంబు త్రైలోక్యపద మబ్బఁగాఁజేయు
భస్మంబు సుగుణముల్ బాదుగొల్పు
భస్మంబు సుజ్ఞానపదముఁ జూపఁగఁజాలు
భస్మంబు మోక్షమన్ ఫల మొసంగు
గీ. ననుచు మొఱలిడు వేదంబు లధికముగను
వినియుఁ దెలియరు కొందఱ జీవెఱ్ఱియేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...36
సీ. జలమిశ్రితసుభస్మ మిలను బూయఁగవలెఁ
గాలత్రయంబున ఘనగృహస్థు
తక్కినయాశ్రమతతిసతుల్ బొడి భస్మ
ధరియింపవలె శ్రుతిధర్మ మిదియ
శాస్త్రోక్తమగు విరజాభస్మముఖ్యంబు
హార్షమౌ వైశ్యదేవాజ్యజంబు
గాకున్న శ్రోత్రియాగార యోగాగ్నిదౌ
భూతియు ధరియింప నీతియనుచు
గీ. శ్రుతులు స్మృతులును జెప్పుటఁ జూచి యెఱిఁగి
భస్మధరియింపఁ వొల్ల రీపాపమేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...37
సీ. భస్మధారణవిధి పరిమితిఁజెప్పెదఁ
బంచశిఖల్ వక్త్రబాహుమూల
ములను భ్రూమధ్యమంబునఁ దగునాసికా
మూలంబు ద్విశ్రవోమూలములను

యురమున స్తనముల నుదరమందున నాభి
జాను పృష్ఠంబున జంఘలందు
రత్నశోబరికూబరశ్రోణిగళముల
భుజయుగ్మమునఁ గరమూలములను
గీ. బాహువులమధ్య నూరువు పాదములను
ముప్పదాఱగుస్థానముల్ ముఖ్యమగును
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత....
సీ. నియతి రుద్రాక్షోపనిషదర్థములు విని
రుద్రస్వరూపిగా రూఢిగలిగి
యామ్నాయములయందు నాగమంబులయందు
రుద్రాక్షధారణ భద్రమనుచు
సకలవిధులఁజెప్పె శర్వాణి మొదలైన
శక్తిసంఘము మహానిసముదయంబు
దేవదానవకోటి భావశుద్ధినిదాల్చి
నారుగా రుద్రాక్షపేరు లభవ
గీ. యెలమి రుద్రాక్షధారణ గలుగునరుని
భక్తిగను మ్రొక్కినను మోక్షపదవిగల్గు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పదునాల్గుముఖములు పదునాల్గుభేదముల్
పదినల్వు రధిపతుల్ పదియు నాల్గు
విని యోగపద్ధతుల్ తనువున ధరియించు
విధులు నెఱింగింతు విరళముగను

ముఁదమొప్పఁగా నేకముఖముఖ్యమైయుండు
    నదరుగా దొరకును నచటనచట
నూర్ధ్వమధోముఖయుక్తిని గనవలె
    నూర్ధ్వముఖంబైన నొప్పియుండు
గీ. ధన్యమైయుండు రుద్రాక్షధారణంబు
నిగమమంత్రోక్తి బూజింపఁ దగినదగును
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. సకలపాపంబులు సమయింపఁగాఁజాలు
    ధరణిలో రుద్రాక్షధారణంబు
సతతంబు కాశివాసముజేయుఫలమిచ్చు
    ధరణిలో రుద్రాక్షధారణంబు
విరతంబు శ్రీశైలనిలయపుణ్యముకొద్ది
    ధరణిలో రుద్రాక్షధారణంబు
పరగ శివజ్ఞానపరునిగావించును
    ధరణిలో రుద్రాక్షధారణంబు
గీ. రుద్రరూపంబుగా మది రూఢిగల్గి
తనువునందున రుద్రాక్షఁ దాల్పవలయు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శంకర మీయక్షజాతంబులగుటను
    రుద్రాక్షనామంబు రూఢియయ్యె
సంసారదుఃఖముల్ సంహారింపంగను
    రుద్రాక్షనామంబు రూఢియయ్యె

దుష్టులదుఃఖించి తొలఁగునట్లుగఁ జేయ
రుద్రాక్షనామంబు రూఢియయ్యె
భవులకు మోక్షసంప్రాప్తిఁ గూర్చుటఁజేసి
రుద్రాక్షనామంబు రూఢియయ్యె
గీ. జగతి రుద్రాక్షతో సరిజేయఁదగిన
పూసలే లేవు కల వన్న దోసమయ్యె
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శంకర దేవేశ జ్వలన పద్మాసన
కాలాగ్ని రుద్రుండు కార్తికేయుఁ
డన వాసుకియు వినాయక భైరవుఁడు చౌరి
యీశాన భాస్కరుఁ డెలమి స్కంద
వారుఁడును పదినల్వు రధిపతుల్ రుద్రాక్ష
లకు నేకముఖమొదల్ ప్రకటముగను
శ్రీగలరుద్రాక్ష లాగమంబులయందుఁ
గొనియాడఁదగియె నీకుతలమందు
గీ. శాస్త్రసమ్మతి రుద్రాక్షసరులు దాల్ప
వలయు మోక్షంబునే మదివలయువారు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శిఖను నొక్కటియును శిరమున ముప్పది
రెండు మూర్ధ్నిని మాలనిండుగాన
ముప్పదాఱును కర్ణముల నాఱు గంఠంబు
నందు ద్వాత్రింశతి నమరవక్ష

మున నై దుశతములు ఘనబాహువులకును
బదియాఱు బదియాఱు బదియు రెండు
బది రెండుగరముల బరగ నష్టోత్తర
శతమౌను జపమాల హితవుమీఱ
గీ. రెండునూఱుల ముప్పదినొండు మెండు
వరకిరీటంబు నీరీతి వలయుఁ దాల్ప
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శిఖ నేకముఖియును శిరమున ద్వాదశ
ముఖియు నేకాదశముఖియు మూర్ధ్న
మునకు శ్రుతులపంచముఖ సప్తముఖ దశ
ముఖ షష్ఠముఖ యష్టముఖియుఁ గంఠ
మునకు నురోదేశమునకుఁ జతుర్ముఖ
తగు బాహువులఁ ద్రయోదశముఖియును
ద్వాదశముఖ మణిబంధనంబుకుఁ జతు
ర్దశముఖ జపమాల తనువహించు
గీ. నన్ని ముఖముల రుద్రాక్షులగు కిరీట
మునకు నని తెల్పుకొనరయ్య మునుపమీఱ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కాయశోషణ జేసి కష్టమందుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు
కాశీగయాదులు గలయదిరుగుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు

పవనబంధనఁ జేసి బాధలొందుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు
సాంఖ్యయోగాదులఁజూడఁ బోవుటకంటె
పంచాక్షరీమంత్రపఠన మేలు
గీ. పాపము హరించు ఘనమోక్షపదవినిచ్చు
పరమపంచాక్షరీమంత్రపఠన మిచ్చు
బావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...46
సీ. ధర యజుర్వేదమణితారహారములోన
పంచాక్షరం బనుపతకమలరు
ప్రథమద్వితీయముల్ ప్రకృతియుఁ బిమ్మట
రెండును బురుషుఁడు సుండి కొదువ
సంయోగమగు శివశక్తియుక్తము మంత్ర
ములకెల్ల జననిగాఁ దలఁచవలయు
గురుమూర్తిదయ పేర్మిఁ గొని న్యాసధ్యానాది
కములతో జపియింపఁగలదు ముక్తి
గీ. గాన నీమంత్రరాజంబుఁ గాంక్షసేయు
వారె మీరౌదు రిఁక వేలుగారు వారు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్రపరసవేదియు నబ్బె
నినువేఁడుకొననేల నీలకంఠ
ఘనతపంచాక్షరీ కల్పకం బబ్బింది
నినువేఁడుకొననేల నీలకంఠ

చిత్రపంచాక్షరీ చింతామణియు గూడ
నిను వేడుకొననేల నీలకంఠ
భవ్యపంచాక్షరీ పారిజాతంబచ్చె
నిను వేడుకొననేల నీలకంఠ
గీ. నిన్ను నన్నుఁగఁ జేయఁగా నేర్చినట్టి
మంత్రరాజంబు దొరకింది మాకిఁకేమి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మహితపంచాక్షరీ మహిమయుఁ దెలుపంగ
వాణిపతికినైన వశముగాదు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగఁ
బలుకుఁజేడియకైనఁ దెలియఁబడదు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగఁ
జిలువతేఁడైనను బలుకలేఁడు
మహితపంచాక్షరీమహిమయుఁ దెలుపంగ
జంభారికైనను శక్తిలేదు
గీ. గానపంచాక్షరీమంత్రఘనతఁ దెలుప
మంత్రరూపుండవగునీవు మాకుఁగలవు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత
బ్రహ్మహత్యాదులు బాయఁగలవు
పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత
నుపపాతకము లవి యుండఁబోవు

పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత
సంసారదుఃఖముల్ సడలఁగలవు
పంచాక్షరీమంత్రపఠనఁ జేసినయంత
మాతృగర్భావస్థ మఱగిపోవు
గీ. దల్లి దాతయు నేతయుఁ దండ్రియగుచు
భుక్తిముక్తులు దయసేయుమూల మిదియు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కుంభసంభవువల్లఁ గోవియు పంచాక్షరి
దశరథరాముండు తా జపించె
దూర్వాసుదయసేర్చి తొల్లి పంచాక్షరి
శౌరియు రాముఁడు జపితలైరి
తండ్రియు దయసేయ తపసియై పరశురా
ముఁడును బంచాక్షరి నుడివెగాదె
వరదధీచ్యాదులు గరము పంచాక్షరీ
మంత్రంబు జపియించి మహిమగనిరి
గీ. మంత్రసంతతి కిది మూలమంత్రమయ్యె
నిహపరసుఖంబు లిచ్చుట కేమికొదువ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...51
సీ. పంచాక్షరీ యనుబలువైననావచే
దరిలేనిదుఃఖాబ్ధి దాఁటవచ్చు
పంచాక్షరీ యనుప్రబలమౌసురియచే
ఘోయని భవలతల్ గోయవచ్చు

పంచాక్షరీ యనుభానుదీప్తులవల్ల
నిరయమ స్తకమును నఱుకవచ్చు
పంచాక్షరీ యనుబహుళమహానగ్ని చే
ఘనజవనాటవిఁ గాల్పవచ్చు
గీ. మోక్షలక్ష్మీప్రదాయకదీక్షితంబు
మహిని పంచాక్షరియె యన్యమంత్రమేల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ప్రణవయు క్తంబుగాఁ బంచాక్షరీమంత్ర
పఠనంబు దగునయ్య బ్రాహ్మణులకు
నితరవర్ణంబుల కెల్లసుందరులకుఁ
బ్రణవహీనంబుగాఁ బఠన మేలు
అష్టాదశావర్తి నక్షరలక్షగా
జపియింప సిద్ధినిఁ జెందవలయు
ప్రతిపునశ్చరణకు బ్రాహ్మణభోజనా
ద్యఖిలవిధులు జేయ సుఖము గలుగు
గీ. మోక్ష మఱచేతిదై యుండు దీక్షలేక
చేసినను మేలె పాపముల్ జెడుట నిజము
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
గురుఁడు పంచాక్షరిగరిమ నొసఁగు
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
పంచాక్షరీమంత్రపఠనగల్గు

గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
పంచాక్షరిని సిద్ధిఁ బడయనగును
గతజన్మసుకృతసత్కారణంబునఁ జేసి
పంచాక్షరియె మోక్షపదముఁ జూపు
గీ. దుష్కృతుల కిది గల్గుట దుర్ఘటంబు
సుకృతమతులకు దొరకుట సులభమగును
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచాక్షరీమంత్రఫలమె కా క్రీడికిఁ
బాశుపతాస్త్రంబు బడయనగుట
పంచాక్షరీమంత్రఫలమెకా చక్రికి
ద్రౌణియస్త్రజ్వాలఁ దప్పనిడుట
పంచాక్షరీమంత్రఫలమె కా రాముండు
దశముఖుఁ దెగటార్చు దశను గనుట
పంచాక్షరీమంత్రఫలమె మార్కండేయుఁ
డవనిదీర్ఘాయుష్య మమరనుంట
గీ. భారతము శివగీతలు భాగవతము
స్కాందమాదిగ గ్రంథముల్ సాక్షిగలవు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శైవపంచాక్షరీజపముకు ముఖ్యంబు
విమలమంత్రోద్ధారవిధియు వినుఁడు
మొదల నకారంబు ముందు మకారంబు
పిదప శికారంబు గదపిపరత

వాకారము యకారవై ఖరి లిఖయింప
పంచాక్షరంబులై ప్రబలుచుండు
బ్రణవంబుతోఁగూడి భవ్యషడక్షరి
యగునని షణ్ముఖుం డధికప్రేమ
గీ. మున్నుఁజెప్పెను గొందఱు మూర్ఖులగుచు
విప్రు లుపదేశమంద రీవింతయేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బ్రాహ్మణజనములు భక్తితోడను లింగ
మును మేనదాల్చుట ముఖ్యమనుచు
వేదాగమంబులు నాదారకను బల్కు
చున్న విభక్తిచే విన్నఁజాలు
విష్ణ్వాదిసురలును వేత్తలౌమునులును
మణిదారుమృచ్ఛిలామయములైన
లింగముల్ ధరియించి రంగుగాఁ బూజలు
చేయుట వ్యాసులు చెప్పినారు
గీ. ధరను గొందఱు దనులింగధారణంబు
గాకపోవుట వారిదుష్కర్మగాక
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ధర యిష్టలింగంబుఁదగు స్థూలమునకును
సూక్ష్మమునకునౌను శుభము ప్రాణ
లింగంబు మూఁడవయంగమౌగారణ
మున భావలింగంబు ముదముమీఱ

ధరియింపవలెనని మొఱయును శ్రుతులన్ని
తెలిసిదెలియనివారిఁ దెలుపుటరిది
యాణువాదిమలత్రిహరణంబు గావించి
మాంసపిండంబును మంత్రపిండ
గీ. ముగనుజేసియు గురుమూర్తి నిగమసూక్తి
శిష్యునకు లింగధారణఁజేసి బ్రోచు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు
పాపాటవులు గాలిభస్మమగును
లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు
దుఃఖాంబుదములన్ని తూలిపోవు
లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు
జన్మబీజము మొదల్ సమసిపోవు
లింగధారినిఁగని లొంగిమ్రొక్కినఁజాలు
బుణ్యపయోనిధుల్ పొంగుచుండు
గీ. ననినచో లింగధారణ ఘనసభక్తి
నైనవారలు మీరుగా నగుటయరుదె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అంగమందున లింగ మమరియుండినవాఁడు
శ్వపచాధముండైన శంకరుండె
అంగమందున లింగ మమరియుండనివాఁడు
శాంతవిప్రుండైన శ్వపచసముఁడె

అంగమందున లింగ మమరుచున్నట్టివాఁ
డనువర్తనుండైన యమునిపరుఁడె
అంగమందున లింగ మమరియుండనివాఁడు
వరసోమయాజైనఁ బరమఖలుఁడె
గీ. ననెడియర్థంబు స్కాందంబునందు గలదు
వినరు చదువరు కొంత యోచింతయేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత ...
సీ. తనువులు మూఁటను దగినవస్త్రంబుల
మూఁడులింగంబుల ముడిచికట్టి
ఇష్టంబు ప్రాణమం దింపుగా లగియించి
భారమందునఁ జేర్చి పరిణమించి
తనయందు లింగంబు దాను లింగమునందుఁ
జొచ్చి లోవెలుపల నిచ్చ మఱచి
లింగంబు తానయై లింగవర్తనుఁడైన
లింగైక్యసమరసలీనుఁ డగును
గీ. నట్టిపురుషుని సాంగత్య మతనిసేవ
గలుగు మీకృపగలిగినఘనులకెల్ల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అద్వైతసిద్ధసనాతని ఘటవర్త
నములు ద్వైతంబులై యమరుచుండు
గాని స్థూలాంగంబు గలయంతమట్టుకు
స్థూలలింగంబందుఁ దొలఁగకుండ

ధరియించి పూజింప ధర్మమైయుండును
స్థూలంబు లింగమై శుద్ధిఁ గనదు
కొదువరెంటను నీశుఁ గూర్చితిమనిచెప్పి
బొదలాదిదేవుని బుట్టలందు
గీ. దాచి పూజింపఁదగదు నద్వైతు లిట్లు
సేయ దేవార్చనలు సిద్ధిఁ జెంద వెపుడు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ద్వైతుఁడై యుండె నద్వైతుఁడై యుండెను
దనుపర్తనలకును దలఁగనపుడు
తనదైవమెప్పుడు దన కవినాభావ
సంబంధిగా నుంచఁజాలవలయు
నట్లుసేయక సంచులందు బెట్టెలయందు
నుంచి పిల్లలపూజ కుంచి వచ్చి
నామనిజెప్పుట నగుబాటుగా కిది
శ్రేష్ఠవర్తనమని చెప్పఁదగదు
గీ. దేవుఁ డెవఁ డైనసరె స్థూలదేహమందుఁ
జేర్చి విడనీక గొల్చుట శ్రేష్ఠమగును
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. శివునిప్రసాదంబు శ్రేష్ఠంబుఁగాదని
భుజియింపఁ గొందఱు బుచ్చికొనరు
హరుఁడు మా నైవేద్య మర్హంబుగాదని
బలికినాఁ డనిగూడ దలఁతు రవని

జ్ఞానహీనం బిది సత్యవాక్యముగాదు
శివునినైవేద్యంబు శిరము మొదలు
బాదయుగ్మముదాఁక భక్తితోఁ బూసియు
భుజియించు కృష్ణుండు పూర్వమందు
గీ. ననుచు శ్రీభాగవతమున వినఁగఁ జెప్పె
నింద్య మనువారలే బుద్ధిమాంద్యు లకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...64

సీ. పితృప్రీతాన్నంబుఁ బ్రియ మొప్ప భోక్తలు
బ్రాణాహుతులు చేయఁ బనికివచ్చు
ధర పితామహుకూడు ధన్యులౌ భోక్తలు
బ్రాణాహుతులు జేయఁ బనికివచ్చు
ప్రపితామహాన్నంబు భవ్యులౌ భోక్తలు
బ్రాణాహుతులు జేయఁ బనికివచ్చు
విష్ణ్వర్పితాన్నంబు వేత్తలౌ భోక్తలు
బ్రాణాహుతులు జేయఁ బనికివచ్చు
గీ. గాని శర్వప్రసాదంబుగాదు గొనఁగ
ననెడిదుష్టులమాటలు వినఁగఁదగదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....

సీ. శ్రాద్ధకాలంబున శ్రద్ధతోఁ బెట్టెడు
పిండత్రయంబుచేఁ బ్రేత లంత
సుగతిగందు రటన్న సూత్రంబు లున్నవి
మధ్యపిండము రుద్రమయముదయ్యె

నాపిండ మూకర్త కర్ధాంగి యగుసతి
సేవింపవలె నని చెప్పె శ్రుతియుఁ
దత్ప్రసాదము గొన్న తరుణియు సంతాన
వంతురాలగు నని వార్తగలదు
గీ. శివప్రసాదంబుగొనఁగ సిద్ధిమెట్లు
భక్తిహీనులవాదముల్ పాటిగావు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పంచభూతంబులుఁ బరమేశ్వరప్రసాద
మైయుండె వ్యతిరిక్త మైనదెద్ది
అష్టమూర్తులు భవునంగసంభవులైరి
హరుప్రసాదులెగాక యన్యులెవరు
చరచరాస్పదమైనజగములో శ్రీకంఠు
వరప్రసాదముగానివస్తు వెద్ది
విష్ణు విధాతాదివేల్పులు శివభక్త
పరులుగా కున్నట్టివార లెవరు
గీ. భవుప్రసాదమహాత్వంబు భాగవతము
శైవస్కాందాది గ్రంథముల్ చాటుచుండు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. హరునకు శివభక్తు లర్పించుభూషలు
ఛత్ర చామరములు సకలవాహ
నంబులు హారముల్ నానావిధంబుల
వస్తువుల్ నైవేద్యవాసన లవి

యివి యనర్హంబులౌ నెవ్వరుగొనరాదు
గొనినచో నరకాబ్ధిఁ గూలఁగలరు
శివభక్తులైయుండి శివునిఁబూజించుచు
శివుప్రసాదము దినఁ జెల్లకున్నె.
గీ. పత్రపుష్పఫలంబులు పక్వములును
హరునివేదనభుక్తి కనర్హమగునె
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఏమంత్రన్యాసాదు లామంత్రమునకును
దగవని చెప్పినఁ దథ్యమగునె
యజ్ఞపురోడాశమాయాజులకుఁగూడఁ
దగదని చెప్పినఁ దథ్యమగునె
పితృశేషమును గర్త ప్రీతిభుజింపంగఁ
దగదని చెప్పినఁ దథ్యమగునె
శివునిప్రసాదంబు శివభక్తులకుఁగూడఁ
దగదని చెప్పినఁ దథ్యమగునె
గీ. యొప్పవచ్చునె యీమాట దప్పుగాక
భస్మరుద్రాక్షధారులౌ పారులధమ
గతికిఁ బోఁగోరి నిందించుకథకుఁ జొరిరి, భావ.
సీ. బిల్వవృక్షముఁజూచి ప్రీతితో మ్రొక్కిన
నరునకు దోషముల్ నశ్యమగును
బిల్వవృక్షంబును బ్రేమతోఁ బూజించు
మనుజుండు సురలకు మాన్యుఁడగును

బిల్వవృక్షము వేసి పెంచినపుణ్యుండు
హరగణంబులయందు నధికుఁడగును
బిల్వబిల్వయటంచుఁ బ్రేమచే స్మరియించు
వారిపాతకములు వారితములు
గీ. నని పురాణంబులందున్నఁ గనరు వినరు
కొందఱజ్ఞులు నిది యెట్టిచందమొకొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కాశికాపురమందుఁ గాలభైరవుకన్న
మకరమందుఁ బ్రయాగమాధవులను
గాంచిన మాంగల్యగౌరివర్ణనమైన
సేతువు కేగిన శేషగిరియుఁ
బొడగన్నఁ గేదారమున గంగఁ ద్రావినఁ
గోటియజ్ఞము లోకమాటుసేయఁ
గలిగిన నొకలక్షకన్యల దానంబు
సేయనబ్బినఁ బుణ్యసిద్ధియంత
గీ. నేకబిల్వార్చనంబున నిత్తుననుచుఁ
బాదరాయణి మొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బహుళాష్టమిని బిల్వపత్త్రంబుతో మిమ్ము
నర్చింపఁ బాతకహరణమగును
శివరాత్రిరోజున భవ నీస్మరణతోడ
బిల్వార్చనము సేత ప్రీతికరము

లక్షబిల్వార్చన లక్షులై చేసిన
వారన మీరన వేలులేదు
ప్రతిసోమవారంబు భక్తితో బిల్వంబు
చేఁ బూజ సేయ విశేషమగును
గీ. నేకబిల్వమహాత్వ మమేకముగను
బాదరాయణిమొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బిల్వవృక్షముక్రిందఁ బ్రేమతో వైశాఖ
కార్తికంబుల భక్తిగలిగి యొక్క
విప్రున కెవ్వరువిందుఁజేసిన కోటి
బ్రాహ్మణభోజనఫలము గల్గు
మారేడుతరుమూలమహిని లింగార్చన
నొకరోజుజేసిన సకలకాల
ములను లింగార్చన సలిపినవాఁడుగా
ఫలమబ్బు సందేహఫణితి వలదు
గీ. సత్యమిది సత్యమిదియును సత్యమనుచు
బాదరాయణిమొదలైనవార లనిరి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మారేడుదళములు నూరిలోలేకున్న
తత్కాష్టఫలములు దగునుబూజ
కవియు దొరకమిదైన నావృక్షమూలమం
దమరిన మృత్తికనైనఁ గ్రమము

నది యసంభవమైన నన్యపత్రంబులు
మారేడుపత్రిగా మానసమున
భావించి పూజింపఁ బాపముల్ విడి పుణ్య
ఫలమిచ్చు సంశయమఁణితివలదు
గీ. సత్యమిది సత్యమిదియును సత్యమనుచు
బాదరాయణిమొదలైనవార లనిరి
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భృగుపత్ని నన్యాయముగఁ జంపినందున
శపియించె భృగుముని శౌరి నపుడు
నదికారణముగాఁగ నాహరి తావచ్చి
పుడమిపై పదిమార్లు బుట్టవలసెఁ
బుట్టుట గిట్టుట పురహరుఁగొల్చుట
భాగవతము జెప్పఁబడినదయ్యె
మితిమించి పలుమాఱు కుతఁ మందునఁ జక్రి
జననమందిరకథల్ చాలఁగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకో మిముఁ గొల్వకుంద రకట
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. జలచరంబులలోన శ్రైష్ఠ్యముగాఁబోలు
మత్స్యమై జన్మించె మాధవుండు
వేదంబులు హరించువిద్వేషుఁ బోరివుచ్చి
తెచ్చి శ్రుతులు వేధ కిచ్చినాఁడు

మత్స్యకేశ్వరుఁ డనుమారారి నతిభక్తి
భువిని ప్రతిష్ఠించి పూజచేసె
మత్స్యపురాణంబు మన్నించి విని మత్స్య
లంకనుఁజని చూడ శంకదక్కు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంత తేలకో మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. రెండవజన్మను దండిదికాఁబోలు
తాఁబేలున య్యె నాదైత్యవైరి
దైత్యులు సురలును దర్పునంభోరాశి
మునుఁగు తిప్పకు వీఁపు మోపినాఁడు
కూర్పసంద్రముపొంత నోర్పుతోఁ గూర్మేశు
నిల్పి సద్భక్తుఁడై కొలిచినాఁడు
కూర్మపురాణంబుఁ గూర్మికోఁ జదివినఁ
గూరేశుఁజూచినఁ గునుకుపిడును
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంత తేలకో మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. అడవిమృగములలో వడిగలదని హరి
ఘనవరాహంబుగాఁ గలిగినాఁడు
ఇదియు మూఁడవజన్మ మిందు హిరణ్యాక్షుఁ
జంపి జగతి మేలు నింపినాఁడు

శ్రీవరాహేశ్వరు శ్రీగిరిపై నిల్పి
మించినభక్తి సేవించినాఁడు
ధర వరాహపురాణతాత్పర్యమును వరా
హేశుఁ జూచియున్నైన నెఱుఁగవచ్చు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తేలకో మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ప్రహ్లాదుకొఱకు స్తంభంబున నరసింహ
రూపుగా జన్మించి శ్రీపతియును
ప్రహ్లాదుతండ్రిని బట్టి గోళ్లనుజీరి
పరలోకగతునిగాఁ బంపినాఁడు
శేషాచలంబున శ్రీనృసింహేశుని
స్థాపించి పూజలు సలిపినాఁడు
బాదరాయణిపల్కు భవ్యస్కాందము నృసిం
హేశ్వరంబునుజూడ నిపుడుగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తేలకో మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ లచ్చిపెనిమిటి గొప్పబిచ్చమెత్తుటకునై
అదితికి సుతుఁడుగా నవతరించి
బలిని యాచించియు బలిని బంధించియు
బలిరాజ్య మింద్రునిపరము జేసి

వామనేశ్వరు హిమవంతంబుపై నిల్పి
యర్చించె భక్తితో నహరహంబు
వామనేశ్వరుఁడును వ్యాసగ్రంథంబులు
నేఁడును సాక్ష్యమై నిలచియుండె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకో మిమ్ముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. సూనసాయకుతండ్రి శుభముహూర్తంబునఁ
బరశురాముం డన ప్రభవమొంది
తరిమి రాజుల నెల్ల తరతరంబులవారి
నిరువదియొక్కమా రేరి చంపఁ
బరశురామేశ్వరం బనఁ బెక్కుచోటుల
శివుని బ్రతిష్ఠించి చేసెఁ బూజ
నతఁడు గొల్చినపురహరునివాసంబులు
జగములోఁ గనుఁగొనఁ జాలఁగలవు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకో మిమ్ముఁ గొల్వకుండు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దశరథరాజును తనయుఁడై శ్రీవిష్ణు
రామనామంబున రహిఁ జెలంగె
వానరసేనతో వారధిబంధించి
దశకంఠకంఠబృందములఁ ద్రెంచె

శివదీక్షితుండునై శివగీతలు గ్రహించి
పరశివజ్ఞానియై ప్రబలె నిలను
సేతువుదగ్గఱ శ్రీరామలింగేశు
నిలిపి యంతశ్శుద్ధి గొలిచినాఁడు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱేలకొ మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కమలాక్షునంశనే గలిగెను యదువంశ
వార్ధిచంద్రుఁడు హలపాణియనఁగ
దుష్టదానవులను దులిచివేసి యనేక
శిష్టసంరక్షణఁ జేసినాఁడు
విద్యార్థియై పోయి విశ్వేశు పురిలోన
సాందీపుకడఁ దానుఁ జదివినాఁడు
తనపేర లింగంబుఁ దగ వారణాసిలో
స్థాపించి పూజలు సల్పినాఁడు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద అధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. వసుదేవసుతుఁడునై వాసుదేవుండన
జన్మించె శ్రీవిష్ణు జగతిలోన
శివునిప్రసాదంబు స్థిరమతి భోగించి
దూర్వాసుకృపఁ గాంచె తోయజాక్షుఁ

దతిప్రయాసమునోర్చి మతినిల్పి హరుఁగూర్చి
తపమాచరించుట ధన్యుఁడయ్యె
చక్రంబుగలిగె నవక్రపరాక్రమ
శీలియై వైరులఁ దూలఁబుచ్చె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కృష్ణుండు కాశిలోఁ గృష్ణేశలింగంబు
నిలిపినాఁ డిప్పుడు గలదు చూడఁ
జంద్రజూటునికృప జాంబవతీదేవి
సాంబునిగనినది సకలమెఱుఁగుఁ
బార్థివలింగంబు బార్థకృష్ణులు బూజఁ
జేయుట వ్యాసులు చెప్పినాఁడు
నరునితోఁ గైలాసనగరంబునకుఁ గృష్ణుఁ
డేఁగి మీకును మ్రొక్కుటాగడంబె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పూర్వకాలంబునఁ బురుషోత్తముఁడు వచ్చి
పురహరుఁగని మ్రొక్కి పరమతత్త్వ
విధిఁ దెల్పుమనికోర విశ్వేశ్వరుఁడు శైవ
దీక్షితుగాఁ జేసి తేజమెసఁగఁ

బరమగుహ్యాం బగుపరతత్త్వమును జెప్ప
నవియు నీశ్వరగీత లనఁగ వెలసెఁ
గూర్మపురాణంబుఁ గోరి చూచిన నందు
నమరు నీశ్వరుగీత లఘహారంబు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద అధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత....
సీ. కరకంఠుఁ బూజింపఁ గమలసహస్రంబు
నిత్యంబు హరికిని నియతమందు
నొక్కనాఁ డొక్కటి లెక్కకుఁ దక్కినఁ
దననేత్రకమలంబు దానవారి
శివునకు నర్పించి శివుని మెప్పించియుఁ
గమలాక్షుఁ డనుపేరుఁ గాంచినాఁడు
ధర మహిమ్నాదులు తత్కథ నేఁటికిఁ
దెలుపుచున్నవి గదా పలుకులేల
గీ. నాదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద తెలకొ మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...87
సీ. శ్రీహరియంశను శ్రీపరాశరసూనుఁ
డుదయించి కాశిలో నుండుటయును
విశ్వేశుఁ బూజించి వేదవిభాగంబు
సేయుచో హరునుతి సేయుటయును

దన గ్రంథములయందు తక్కినసురలంత
శివభక్తులని యొప్పి చెప్పుటయును
గొప్పసాక్ష్యం బది కొదువయేమున్నది
పలుమాఱు తర్కింపఁ బనియుఁ గలదె
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. జైనవంశమునందు జన్మించి మాపతి
బుద్ధనాముఁ డనఁ బ్రసిద్ధుఁ డయ్యె
భువనేశ్వరంబున బుద్ధేశ్వరునిఁ గొల్చి
శివభక్తులకు నెల్ల శ్రేష్ఠుఁడయ్యె
బుద్ధేశ్వరప్రసాదభుక్తిలేక యతండు
నేఁడును భుజియింపఁ బోఁడు సుండి
శ్రీజగన్నాథంబు సేవింపఁబోయిన
భువనేశ్వరముఁ జూడఁ బోకపోరు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద ఱధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కల్కిజన్మము ముందుగాఁ గలనందురు
గతకల్పకంబులఁ గల్కివేష
మమరె శ్రీశునకని యనియె గ్రంథంబులు
నాతండు శివభక్తుఁ డవును జగతి

గల్కేశ్వరంబులు గలవు పెన్నానది
తీరమందున మున్ను సారసాక్షుఁ
డారూపమునఁ గొల్చినట్టివె యైయుండు
లేకున్న నా పేరు గాకయుండు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద అధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దక్షుజమూర్తికి ధర్మునకునుబుట్టి
నరుఁడు నారాయణనామములను
బదరివనంబునఁ బశుపతికై ఘోర
తప మాచరించిరి దనుజవైరి
యంశలువీరలు హరుకృపాకలితులై
ధర్మవిరోధులదండనంబు
సేయఁజాలిరి వీరిచరిత భారతమందు
భాగవతమునందుఁ బలికినారు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద అధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. పాండురంగంబనఁ బ్రబలమైనస్థలంబు
పడమటిసీమలోపలను గలదు
విఠ్ఠలఁ బేరుతో విష్ణు వచ్చటనుండు
నాశ్రితరక్షణాయత్తుఁడగుచు

శివదీక్షితుండైన శ్రేష్ఠత్వమునఁ జేసి
విఠ్ఠలేశ్వరుఁడయ్యె విస్ఫుటముగ
శిరమున లింగంబు ధరియించియున్నాఁడు
వలదన నెవ్వరివశముగాదు
గీ. ఆదివిష్ణువు శివభక్తుఁ డగుట నిజము
కొంద అధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బ్రహ్మప్రతిష్ఠలు బ్రహ్మేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
ఇంద్రప్రతిష్ఠలు నింద్రేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
వరుణప్రతిష్ఠలు వరుణేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
సూర్యప్రతిష్ఠలు సూర్యేశ్వరంబులు
ఘనముగా భూమిపైఁ గలవు గలవు
గీ. అట్టివారలు శివభక్తు లగుట నెఱిఁగి
కొంద అధములు మిముఁ గొల్వకుందు రకట
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. తమపేరు శివునితో దంటించి లింగముల్
స్థాపించి రమరులు దనుజవరులు
భోగులు గరుఁడులు భూమీశ్వరులు మునుల్
యక్షగంధర్వులు యతులు శక్తి

సంఘుంబు సిద్ధులు స్థావరంబులు భూమి
భేతాళనిచయ మీప్రపంచవిలోన
నాయాస్థలంబుల నాయావిలింగముల్
గనుగొన్నఁ గన్నులకరువుదీఱ
గీ. వీరలందఱు శివభక్తిపారమతులు
శివునిఁ గొల్చక గొందఱు జెడుటదేమొ
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. అదితినందనుఁడైన యావామనునిపాద
కమలమందున గంగ గలిగె నవియు
విష్ణుపద్భవయన వెలసినయాగంగ
హరుఁడు జటాజూటమందు భక్తి
దాల్చినాఁ డనియేటిదబ్బఱమాటను
వినరాదు దోషంబు విస్తరించు
గంగపుట్టుక వేఱు గంగాధరుండౌట
కారణం బది వేఱుగలదు మొదలఁ
గీ. బూర్వపక్షంబు జెప్పెదఁ బొందుగాను
వెనుక వినుపింతు సిద్ధాంతవివర మెల్ల
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మునిశాపవృతమైన మురవైరిజన్మముల్
బదివిధంబులు నందు బంచమంబు
వామనంబగు గంగ వామనుపదమునఁ
బుట్టక పూర్వమేపుట్టె జలము

గతకాలమున గంగగనుపడకుండిన
జగమువర్తన మెట్లు జరుగఁబడును
మత్స్యకూర్మంబులమాట నేమనఁగలె
నీరులేకవి యెట్లు నిలువఁగలిగెఁ
గీ. గాన జలములు బూర్వమే కలవటంచు
నొప్పుకొనవలె లేదింకఁ దప్పుకొనఁగ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బలి వామనునిపాదపద్మముల్ గడుగంగ
జలము లెక్కడనుండి సంభవించె
వటునిపాద బ్రహ్మ యెటులఁ బ్రక్షాళించెఁ
దనవద్ద నుదకంబుఁ దాచకున్న
వామనుండే ముందొ వార్ధిమథనమె ముందొ
కూర్మావతార మిాగుఱుతుఁ దెల్పు
బలిని జన్మంబులోపలఁగదా యాచించె
జన్మమెట్టుల సాగె జలములేక
గీ. కాన జలములు బూర్వమే కలవటంచు
నొప్పుకొనవలె లేదింకఁ దప్పుకొనఁగ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. బలికొఱకై పుట్టుపని తనపనిగాని
కలదె గంగోద్భవకారణంబు
బలియింటికినిబోవుపని తనపనిగాని
కలదె గంగోద్భవకారణంబు

బలిని భిక్షించెడిపని తనపనిగాని
కలదె గంగోద్భవకారణంబు
బలిని నిగ్రహపెట్టుపని తనపనిగాని
కలదె గంగోద్భవకారణంబు
గీ. కారణములేనిచో గంగ కలుగునట్టు
లూరులేకున్న బొలిమేర యుండునట్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. హరిపాదమున గంగ యదిపుట్టుకుండిన
హరిపదపూత యైనట్టిగంగ
మౌళిదాల్చినవాఁడు శూలియటంచన
నొప్పరా దది గొప్పతప్పుమాట
మన్నొకయడుగున మిన్నొకయడుగునఁ
గొలిచినజలవాసములను విడచి
కొలిచెనే గతమందు జలము లెన్నఁడు పాద
ప్రక్షాళనము సేయఁ బడఁగ లేదె
గీ. విష్ణు తనపాదమునకని వేరె గంగ
దాచికొనినాఁడో యదియేనొ తనకుఁగూడ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఘనత్రివిక్రమమింటికాల్ గడుగకమున్ను
మిన్నేరు లేదొకో మించిపూత
యై లేదొ లేకున్న నాలోకులకు నెట్లు
జరిగెనో పూతయౌజలము లేల

వాకలుద్రావిరి వామనుపదముకుఁ
  బ్రక్షాళనము కెట్లు పనికివచ్చె
హరి వామనుండైన నాకాలమెన్నఁడు
  బంచభూతంబులప్రభవ మెపుడు
గీ. నాలుగవతత్త్వ మిది వటుకాలునొక
పావనంబయ్యె నను టిది బాడిగాదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. ఆది కనాదియౌ నాకాలమునఁగదా
  గంగ నొదలఁదాల్చెఁ గాలకంఠుఁ
డదితిగర్భంబున హరిబుట్టి యింద్రుని
  తమ్ముఁడై నదినంబు దలఁచిచూడ
ధర భగీరథరాజు తనవారికొఱకునై
  భాగీరథిని దెచ్చుపర్వమెన్నఁ
గాలభేదంబులు గనుపించె భాగీర
  థీజన్మకాలంబె దేవదేవ
గీ. నతను గంగాధరత్వంబు ప్రకటమనుట
నేర కనుమాటలేగాని నిజముగావు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. ఆకాశవీధికి హరిపాదమునకును
  విష్ణుపాదంబని వెలయుపేరు
శౌరికిఁ గప్పకుఁ జెలఁగి సింహంబుకు
  హరి యనుపే రొక్కటగును జగతి

హరి కప్పుఁగాఁబోవఁ డాకాశవీధియు
హరిపాదమని చెప్ప నలవిగాదు
ఆకాశముననుండి నవనికి దిగుగంగ
కును విష్ణుపద్భవ యనఁగఁ జెల్లు
గాక హరికిని గంగ కలుగలేదెన్నఁడు
గలిగినదనుమాట కల్లకల్ల
గీ. బ్రహ్మ నడిగిన నీరిలఁబడియె నదియె
విష్ణుపది యనునదియునై వెలసెనేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భాగీరథినిజూచి భక్తితోఁనర్చింప
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
భాగీరథికిఁబోయి భక్తిస్నానముఁజేయ
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
భాగీరథీజలపానంబుఁజేసిన
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁగవి ప్రస్తుతిజేసిన
శుద్ధుఁడౌ ననుట ప్రసిద్ధిగలదు
గీ. పరమభాగీరథికి హరిపాదమునను
సిద్ధిగల దనుశాస్త్రప్రసిద్ధి లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భాగీరథినిజొచ్చి ప్రాణంబువిడిచిన
శుద్ధుఁడౌననుట ప్రసిద్ధిగలదు

భాగీరథిని శల్యపాతంబుఁగల్పిన
శుద్ధుఁడౌనసుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁ బిండపతనంబుగల్గిన
శుద్ధుఁడౌనసుట ప్రసిద్ధిగలదు
భాగీరథినిఁ దిలల్ బట్టి తర్పణమేర్చ
శుద్ధుఁడౌనసుట ప్రసిద్ధిగలదు
గీ. పరగ భాగీరథికి హరిపాదమునను
సిద్ధిగల దనుశాస్త్రప్రసిద్ధి లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. సరయువులోఁబడి చనియెఁగా రాముండు
తనపాదపూతయై తగియెనేమొ
వార్ధిలో హరిబడి వరదనువచ్చుట
తనపాదపూతయై తగియెనేమొ
పరశురామునితండ్రి పరభువక్రియలకుఁ
దనపాదపూతయై తగియెనేమొ
దివ్యతిరుపతులందు దేవార్చనములకుఁ
దనపాదపూతయై తగియెనేమొ
గీ. గంగచే హరి పూతుఁడౌ కతలుగలవు
గంగ శౌరిపదంబునఁ గలుగుటెట్లు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ఆదికాలంబున నంబిక హరినేత్ర
కమలముల్ మూసిన కామవైరి

ఫాలనేత్రమువిప్ప ప్రళయాగ్ని జగములఁ
బర్విన హిమసుత భయమునంది
కనులమూఁతయుమాని కరములు దివియఁగా
నానందజలములు నంగుళములఁ
బదియుజారెను నవి పరగ నాపస్తత్వ
సంబంధు లీరీతి సంభవించి

సీ. గంగ జగములు ముంపఁగ నంగజారి
సురలు వేఁడిన నిడె జటాజూటమందు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. కమలాసనుఁడు మది గర్వించి మించినఁ
దలద్రుంచితివి యొక్కతలయుఁబోయి
నాల్గుమోములతోడ నాటనుండియు స్రష్ట
మేరమీఱక తాను మెలఁగుచుండె
బ్రహ్మను దలఁగొట్ట బ్రహ్మహత్యయు శివు
నంటినదని మూర్ఖులందు రకట
బ్రహ్మచావని దెట్లు బ్రహ్మహత్యఘటించుఁ
జచ్చిన మఱిగదా వచ్చుహత్య

గీ. యనుచుఁ దెలియంగఁజాల రాయంగహీన
తయును మృతియౌనె పరికింపఁదగదె దీని
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. గంగలోఁబడి ద్విజుల్ గాలంబుఁ జేసిన
గంగకు హత్యయు గలుగదయ్యె

నగ్నిలో విప్రులు నాహుతియైనను
నగ్నికి హత్యయు నంటదయ్యె
పడమటిగాడ్పుకు బ్రాహ్మణుల్ జచ్చిన
గాలికి హత్యయు గలుగదయ్యె
భూమిగ్రుంగిన గొప్పభూసురుల్ మడసిన
భూమికి హత్యయు బొందదయ్యె
గీ. గాని వాణీశు నొకతల గత్తిరింప
నెట్లుదవిలెనొ హత్య యీనీతియెట్లొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. ధరదినప్రళయము జరిగినప్పుడు విప్ర
సంఘమరణము లెన్నిజరుగలేదు
బ్రహ్మప్రళయమునందు బాడబుల్ బహుమంది
ప్రాణహింసను బొందఁబడఁగలేదొ
విష్ణులయంబున వేదవేత్తలు చాల
జీవముల్ విడుచుటఁ జెల్లలేదొ
ప్రళయకర్తృత్వము బరమేశునకుఁదక్క
నొరులకు లేదన్నయుక్తి వినరొ
గీ. యెప్పుడును హత్యజెందక తప్పుసేయు
విధిని దండింప హత్యను విధులుగలవె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. కండకావరమున గర్వించి నిందించు
నట్టిదక్షుని తలఁగొట్టినపుడు

నాజన్మమం దున్నహారితలఁ దెగఁగోసి
తీసి గుండంబులో వేసినపుడు
పూషుఁడన్ సూర్యునిఁ బోసీక పడవేసి
పాడిబోడిగాఁ బండ్లుబోడిచినపుడు
పలుకుఁజేడియ నంటఁబట్టి చేకత్తితో
ఘోరంబుగా ముక్కుఁ గోసినపుడుఁ
గీ. జెప్పలేరైరి హత్యగాఁ దప్పసేయు
విధిని దండింప హత్యను విధులుగలవె
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. దశకంతుహత్యను దప్పింప రాముండు
నిలమీఁద రామేశు నిలిపినట్లు
పరశురాముఁడు రాజవరులఁ జంపినహత్య
జీర్ణింప శివునిఁ బూజించినట్లు
బ్రహ్మాదిసుర లంతపాపముల్ హరియింపఁ
గుతలమందు మహేశుఁ గొలిచినట్లు
బ్రహ్మహత్యయుఁ బాయఁబరమేశ్వరుఁడుమున్ను
నేదేవు నర్చించి యీగెననినఁ
గీ. జెప్పఁజాలరు నోరెత్తి తప్పువాడుఁ
జేయువారల యెన్నికఁ జేయనేల
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. భస్మాసురుం డనుపాపాంతరముగల
వ్రాతుఁ డనుగక్కసుఁ డొకఁడు మున్ను

మీరిచ్చువరమున మీశిరంబునఁ దన
కరముబెట్టెదనన్న బలుగుఁజూపి
వైకుంఠమునకేగ వైకుంఠుఁ డాశత్రుఁ
బరిమార్చినను మీరు బ్రతికినార
లని భాగవతమున ఘనమనిజెప్పెను
సత్యమిది యనినమ్మఁజాలినట్టి
గీ. యితరసాక్ష్యంబులా లేవు నిందుకైనఁ
బూర్వపక్షంబు లిత్తు నపూర్వఫణితి
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మృత్యుంజయత్వంబు నిత్యత్వ కాలాంత
కత్వంబు మీకును గలదటంచు
వేదాగమంబులు వినుపించుచున్నవి
యనృతంబులనగను నలవిగాదు
పుట్టుకగలవారు గిట్టకదప్పదు
పుట్టుటలేనిచో గిట్టుటట్టు
కోరిన నిచ్చిన మానక నిశ్చయు
లగువారి కుపయోగ మగునుగాక
గీ. వృకున కిచ్చినవరమున నకట మీకు
భయముగల దన తగుహేతుపథము లేదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. వరము వేఁడు వృకుండు వానిశిరంబును
వానికరస్పర్శవలన బ్రక్క

లగునట్లు కోరఁడు నడుగక యిచ్చుట
పొసఁగదు యీమాటపొందిలేదు
వానికరస్పర్శవలననె వానికి
మృతిగల్గె ననుమాట సతముగాదు
పొసగింపుకథగాన పసలేనిరీతులు
గలుగ నుడివెనంచుఁ దలఁపవచ్చు
గీ. వీరభద్రునికథవలె వేదమందు
వృకునిచరితంబు నిజమైనప్రకటపడదె
భావభవభంగ గౌరిహృత్పద్మ భృంగ, రాజిత...
సీ. ధరలోన నేదేవుఁ దలఁచి జంపించిన
వచ్చి ప్రత్యక్షమై వారిమనిచి
యంతర్హితముగను టదిసహజమెకద
యంతర్హితుం డగునట్టిశక్తి
గలవాని కేటికి నలసెఁ బరాజితుం
డగుటకు వృకునకుఁ దగనొసంగు
వరముఁ బరీక్షింప వైకుంఠమునకును
వచ్చిన వైకుంఠవాసుఁ డడలి
గీ. తలఁప దయఁజేసి వృకుఁజంపఁ గలుగుశక్తి
నతనికిచ్చితి రని చెప్పనగునుగాక
భావభవభంగ గౌరిహృత్పద్మ భృంగ, రాజిత...
సీ. శాస్త్రవక్రుతమైన శ్రమలనుభవించుట
ప్రబలవైరులగని పారిచనుట

శంకరుగృపచేత జయములనొందుట
గర్వించి శిక్షలగనుట మనుట
భాగవతమున హరిపాటులు బలుమాఱు
గనుజెప్పకయె మాన తనకు వల్ల
లేక బోవుటనుండి యాకవిహృదయంబు
క్షోభించి తన కిదేలాభ మనుచుఁ
గీ. బూని బదులుగ వృకుకథ లేనిదొకటి
జేర్చియుండిన నిజమని చెప్పరాదు
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...
సీ. మింటిపురములమూటి మంటగలిపినసీదు
కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
పలుమాఱు బ్రహ్మాండవిలయాగ్నులౌ నీదు
కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
పుష్పబాణుని మేను బూదిఁజేసినసీదు
కంటిసెగల్ వృకుఁ గాల్పఁదగవె
వృకునకు వరమీయ వృకుఁడు నిన్ బాధింప
నొరులు నివారింప నుండిరంట
గీ. నమ్మఁగా రాదు నిజమైనకమ్మవిల్తు
దండ్రి మీకును భార్యయాతఁడని గలుగు
ప్రేమచేఁ దక్కువకు నోర్చి కామివగుచుఁ
గీర్తిపరుఁ జేయ నారీతిఁ గెరలితేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ, రాజిత...

సీ. శూరపద్మునకంటె శూరుండుగాఁ జెప్పఁ
 దగదు వృకాసుర జగతిలోన
సింహావక్త్రునకన్న శ్రేష్ఠుండుగాఁ జెప్పఁ
 దగదు వృకాసుర జగతిలోనఁ
దారకాసురుకంటె దండివాఁడని చెప్పఁ
 దగదు వృకాసుర జగతిలోన
వృకునకు వరమీయ వృకుఁడు నిన్ బాధింప
 నొరులు నివారింపఁ జరితయగుట
గీ. నమ్మఁగారాదు నిజమైనకమ్మవిల్తు
దండ్రి మీకును భార్యయౌతరిని గలుగు
ప్రేమచేఁ దక్కువకు నోర్చి కామివగుచు
గీర్తిపరుఁ జేయ నారీతిఁ గెరలితేమొ
భావభవభంగ గౌరిహృత్పద్మ భృంగ, రాజిత...

సీ. అష్టమూర్తులు భవునంగసంభవమని
 వేదముల్ బలుకుట వినియు వినియు
బద్మసంభవునకుఁ బరమేశ్వరుఁడె పుత్త్రుఁ
 డని చెప్పెదరు కొంద ఱధమమతులు
విధిసూనుఁ డనుపేరు విశ్వేశ్వరునకును
 నమర నిఘంట్లలో నమరవలదె
నగచాపుని సహస్రనామంబులందైన
 స్రష్టజుఁడనుపేరు జరుగకుండె

గీ. శ్రుతుల నీవార్త వినరాదు సతముగాని
వాదములు సేయవలదన్న వారువినరు, భావ...

సీ. ప్రష్టముఖంబున సాక్షాత్కరించిన
జనకత్వ మతని కేసరణిగలదు
స్తంభమందు నృసింహసంభవంబయ్యెఁగా
స్తంభంబువారికిని దండ్రియగునె
స్తంభంబునకు శౌరి తనయుఁడంచన బల్క
వచ్చునె యీమాట మెచ్చఁదగునె
యిట్టిలక్ష్యంబులు గట్టిగాఁ బరికింప
కున్న లాభంబేమియున్నదిందు

గీ. ధాత యతిభక్తి మిముఁగూర్చి తపసియైన
నతనిముఖమందుఁబ్రత్యక్ష మైతిరంతె,భావ...

సీ. వసుదేవనందను వాసుదేవుండని
పిలచినట్లుగ మిమ్ముఁ బిల్వకుండ్రె
యదితిసూనుని నింద్రు ననుజన్ముఁడాయని
పిలచినట్లుగ మిమ్ముఁ బిల్వకుండ్రె
పద్మమందుదయింపఁ బద్మజుఁడాయని
పిలిచినట్లుగ మిమ్ముఁ బిల్వకుండ్రె
దశరథపుత్రుని దాశరథీయని
పిలచినట్లుగ మిమ్ముఁబిల్వకుండ్రె

గీ. ధాతకును మీరుపుట్టుట తథ్యమేని
నిజమెలుంగళ యనుట దుర్నీతిగాక, భావ...

సీ. భాగవతంబునఁ బాఠకుఁడై కవి
వాస్తవంబులు గొన్ని వదలినాఁడు
పెక్కులేటికి లెక్కబెట్ట వ్యర్థపుశ్రమ
నొక్కటి నుడివెదఁ జక్కగనుఁడు
దక్షాధ్వరంబుకు దనుజారివచ్చిన
లేదనిజెప్పెను గాదు నిజము
వేదమం దీకథ విరళమైయున్నది
వేగిరమై వీరుండు విష్ణుశిరము
గీ. వెఱచి యాహవనీయాగ్ని వేసె ననుచు
శ్రుతియుబలుకుటఁబోతనచూడఁడేమొ, భావ...

సీ. పద్మాక్షుఁ డొకతరి పద్మాక్షియై సుధా
భాగనిర్ణయముకు భారపడియె
విష్ణుప్రకృతి భగవిధము రూపంబని
వేదాగమంబుల వినఁగవచ్చు
శివుఁడు పురుషుఁడని చెప్పెను శ్రుతులన్ని
ప్రకృతియుఁ బురుషులు భావశుద్ధి
గన నభేదులు భేదగతులునై తోతురు
మాన్యమోహినికిని మగఁడవీవె
గీ. కాన నిన్నభిలషించిన గలిగెఁ గొడుకు
కూఁతురా మోహినికివారు గుఱుతుగారె, భావ.

సీ. మోహినీదేవికి మొదటిబిడ్డండయ్యె
భైరవుం డతఁడీశ భవనములకుఁ

ముద్దుకూఁతురుగదా మోహినికిని శాస్త్ర
కువలయేక్షణ లెల్ల కోవెలలకు
నధికారులై యుంట యందరెఱిఁగినపని
కాదన లేదన గలుగనెవరు
ఆయన్న చెల్లెండ్రు హరిరాణి నే వావి
పిలువంగ వలయునో పలుకరెవరు
గీ. విష్ణు శివునకు భార్యయై వెలసెననియు
ధర మహిమ్నంబు జెప్పుటనరులువినరొ, భావ...
సీ. భృంగాఖ్యుఁ డనెడువాఁ డంగనయైసంతుఁ
గనుట భారతమందు గలుగలేదొ
యిళుఁ డింతియై గురు నిందుపుత్త్రునిగూడి
సంతతిగను టదిసతముగాదొ
వీర లిట్లగుటకుఁ గోరిరె యాదిమ
దంపతుల్ జేసినదారిగాదొ
తనప్రకృతై యున్న దనుజారి నారీతి
స్త్రీనిజేయ సుఖింపఁ జేతగాదె
గీ. మోహినియు శివునిమాయలో ముంపెనుచు
విష్ణువాదులు జెప్పుట వెఱ్ఱిగాక, భావ...
సీ. శ్రీయుద్భటారాధ్య శేఖరుం డగువీర
భద్రాఖ్యగురుకరభవ్యశిరుడ
గురులింగజంగమచరణసేవానంద
శైవుఁడ సంప్రాప్తషట్థ్సలుండ

దేశికానుగ్రహాదివ్యలింగాంగైక్య
సంధానసమరససంపదుఁడను
త్రివిధప్రసాదానుభవయోగసుఖకర
విమలహృత్కర్ణికావికసనుఁడను
గీ. భువి కొమట్రాజు వేంకటశివుఁడనంగ
వెలసి రచియించితిని బ్రోవవలయు దయను, భావ.

సీ. మత్కావ్యకన్యను మనుమీయవలెనని
తలఁచితి మీకన్న ధన్యులెవరు
సురలంత తక్కువతరము కులములయందు
భుజగభూషా నీవె భూసురుఁడవు
సిరికి నీకన్నను శ్రేష్ఠులెవ్వరు వెండి
బంగారుకొండలపతివి గావె
శాశ్వతుల్ గారయ్య సకలవేల్పులు శ్రుతి
సిద్ధంబుగాను శాశ్వతుఁడవీవె
గీ. కనుక నిచ్చితి మత్కృతికన్యనిపుడు
గొనియు సల్లాప సౌఖ్యంబు లనుభవింపు
భావభవభంగ గౌరీహృత్పద్మభృంగ
రాజితశుభాంగ రేపాలగంజలింగ. 127

రేపాలరాజలింగశతకము
సంపూర్ణము.

---

# పీఠిక.

ఈశతకమును రచించినది దిట్టకవి రామచంద్రకవి. ఇతఁడు కాశ్యపసగోత్రుఁడు. రంగారాయచరిత్రము వ్రాసిన నారాయణకవికుమారుఁడు.

రఘుతిలకశతకము కందపద్యములలోఁ గడుమనోహరముగా వ్రాయఁబడినది. కవి నిరర్గళధారాశోభితుఁడగుటచే భక్తిరసము గురియునటులఁ జక్కని పోకడలతో శతకముఁ బూర్తిచేసియున్నాఁడు. ఒకపద్యమును జదివితిమేని శతకమంతయుఁ బూర్తి చేయనిది తోఁచనంత సరసముగా నీశతకము వ్రాయఁబడినది. ఇందలిపద్యములయందు శ్రీరాముని దివ్యలీలలు సజీవముగాఁ జిత్రితములై యుంటచే ముముక్షువుల కియ్యది ముఖ్యముగాఁ బఠనార్హముగా నున్నది.

ఈకవిజీవితము విపులముగా మహిషాసురమర్దని శతకములో నుంటవలన నిచట నుదాహరింపక మానితిమి. రామాయణమునందలి ముఖ్యాంశములు శ్రీరామునిదయాశాంతాతిమానుషలీలల సుద్బోధించునంశము లొక్కటొక్కటి యొక్కొక్కపద్యమున మనోహరముగాఁ గూర్పఁబడియున్నందునఁ

బద్ధ్యములన్నియు భక్తులకు సంతోషకరములనుటకు సందియ మించుకేనియుఁ గలుగదు.

శతకపుకుటుము చక్కనిగమనికతోనుంటవలనను బద్ధ్యమును పదనుగుణముగా ధారాశోభితమైయుం టవలనను శతకవాఙ్మయమున కిదియొకవిశేష మని చెప్పనగును. ఈయమూల్యాముద్రితశతకము మేమె తొలుత ప్రచురింపఁగలుగుట మాయదృష్టము.

ఈశతకమాతృక మాకొసంగి గ్రంథముద్రణము నకు సానుభూతిఁ జూపిన శతకకర్తవంశీయులగు మ-రా-రా-శ్రీ, దిట్టకవి సుందరరామయ్యశర్మ పాక యాజిగారి యెడఁ గృతజ్ఞులము.

నందిగామ.
1-1-25

ఇట్లు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# ర ఘు తి ల క శ త క ము.



క. శ్రీరామా యనినప్పుడు
కోరిక ఫలియించె మాకుఁ గోసలతనయా
దారక మార్తాండకులో
ద్ధారక రఘుతిలక నిటలతటనటదలకా. 1

క. నానాఁటికి నానోటికి
తేనై చెఱకై యనంటి తెఱఁగై వెఱఁగై
యానందమొసఁగు నీయభి, ధానము... 2

క. నాతల్లి జానకీసతి
నాతండ్రివి నీవు మీకు నందనుఁడను న
న్నే తెఱఁగునఁ బ్రోచెదో సం,త్రాతవు... 3

క. ఎల్లజగంబుల కాదిమ
వల్లభుఁడవు పోషకుఁడవు వర్ణించెద ని
న్నుల్లము రంజిల్లఁ గుభృ, త్తల్లజ... 4

క. తీండ్రించు మొదటివెలుఁగని
యండ్రార్యులు నిన్ను మినుకులట్టులఁ బలుకన్
గుండ్రాతి నాతిఁ జేసిన, తండ్రీ... 5

క. కలుషాజవంజవార్ణవ
ములు దాఁటఁగ నిఁక నుపాయములు దొరుకవు నీ
విల సన్నుతిదక్కఁగ నిను, దలఁతున్... 6

క. ధరణిం బురణింపఁగ నీ
కరణిం గరుణించుదొరలు గలరె గుణమణీ
భరణీ దురితమహార్ణవ, తరణీ రఘు... 7

క. పాటించి నిన్నె కొలిచెద
హాటకగర్భాండకల్పనానూనమహా
నాటకవిశిఖవిపాటిత, తాటక... 8

క. శశిధరవిధిముఖులకుఁ బ్రా
యశముగ నీయశము పొగడనగునే యుగప
ద్దశవిశిఖగళితదశగళ, దశగళ... 9

క. దండము భవదంఘ్రులకు న
జాండసహస్రాద్భుతప్రదాయకపటుదోః
ఖండీకృతభీమధను, ర్దండా... 10

క. గర్గాదివినుత బ్రోవవె
భర్గసమోదగ్రరూపభార్గవఘటిత
స్వర్గపథమథనవిలస, న్మార్గణ... 11

క. ఊహా భవన్నుతియెడ నా
కాహావసమయప్రకల్పితానూనజగ
న్మోహనరూపహనూమ, ద్వాహన... 12

క. వర్ణింతు నీగుణంబులు
దీర్ణమహోముక్తి కామధేనుసమూహః
పూర్ణపయఃపుషితాశ్రిత, తర్ణక... 13

క. కల్యాణమతివిగద కౌ
సల్యాసద్గర్భజలధిశశధర నీని
స్తుల్యచరిత్రము త్రిజగ, త్కల్యము... 14

క. అజ్ఞానలవముపోకని
ప్రజ్ఞావిభవంబు నాదుభావంబున కీ
వాజ్ఞాపింపవె పాలిత, తద్జ్ఞా... 15

క. స్వామీ యేమనిపొగడుదు
నీమహిమ లనంతములు మనీషకుహితమై
కామించితి నీయడుగుం, దామర... 16

క. 'రామా' యనువర్ణద్వయి
లో మఱిపాపములఁ దోలు లోనికిచొరకుం
డా 'మా' కవాటమగు శుభ, ధామా... 17

క. నీయంతప్రభువు కలుగుట
కే యుపమలనోఁచిరో సుమీ జగతిం ద్రే
తాయుగమర్త్యులు హితఫల, దాయక... 18

క. నాయయ్య నీవు జానకి
నాయమ సౌమిత్రి నాచినయ్య కుశలవుల్
మాయన్నలు నీవాడఁగ, దా యిఁక... 19

క. సంసారరిరంసాపరి
పాంసుజలమువిడిచి మోక్షఫలసుధ దెలుపన్
హంసము తారకమంత్రో, త్తంసము... 20

క. పేర్చినకృపచే నను నీ
కూర్చినసేవకులలోనఁ గొండొకనిగ నే
ర్పర్చవె నీకథ లిచెవిఁ, దార్చితి... 21

క. ఏనోము నోఁచినను నీ
మానితపాదాబ్జభజన మదినోఁచవలెన్
లేనియెడ విడునె కర్మవి, తానము... 22

క. ఆసించితి భవదర్చా
భాసురభాగ్యానుభవము భావంబున నేఁ
జేసినతపమెట్టిదో నీ, దాసుఁడ... 23

క. పరులకు నేఁగా నిఁక న
న్నారు లెవ్వరు గడనసేయ రోపికచే నీ
వరసి భరియింపవలె నా, శరణా.... 24

క. సరసిజభవునకు దుర్లభ
మరయఁ ద్రయీధర్మములకునైన నశక్యం
బిరవుగ నినుబొగడఁగ నా, తరమా... 25

క. వెలయ రసజ్ఞకు రుచిగాఁ
జెలఁగును నీనామభజనఁ జేసెద నోహో
నిలచి మెలంగవె యిఁక నా, తలఁపున... 26

క. ఏతపమువనో నీని
ర్హేతుకసంజాయమానకృపవలననో నీ
ఖ్యాతిమదిగలిగె నోశివ, తాతీ రఘు... 27

క. ఓపరమపురుష శుభమయ
ప్రాపయి రక్షించునీదుపదభజనాని
క్షేపము నామదిలోపలఁ, దాపితి... 28

క. అన్యునిగాఁ జూడకు నను
మాన్యునిగావించి బ్రోవుమా పరహితసౌ
జన్య మొనగూర్చి కరుణా, ధన్యా... 29

క. మనుపఁగఁతనువున నిను గొ
ల్వనిదోసముచే జనింపవలసె నిపుడు గొ
ల్చినవాఁడనైతి నీకృప, ననుపుము... 30

క. మునుజేసిననేరము మొ
క్కిన మఱతువు ధనము లర్థి కిడి మఱతువు న
న్నును నట్లు మఱువవుము నీ, తనయుఁడ .. 31

క. వినయవివేకము లెఱుఁగని
మనుజాధము నన్నుఁగరుణ మన్నింపవె యో
దనుజాంతక యోదశరథ, తనయా... 32

క. దండితదృప్యద్రిపువే
దండాదండధరు దరిమి దయచే నను నీ
దండకుఁజేర్పవె ధృతకో, దండా... 33

క. జ్ఞానం బెఱుఁగనివాఁడను
మానవుఁడను మందమతిని మన్నింపవె నీ
వానిగఁగొను కాంచనపరి, ధానా... 34

క. శరణాగతపరిరక్షణ
బిరుదాంకుఁడ వీవు నేను భీతాత్ముఁడ నన్
గరుణింపవేని కలదా, దరియింక... 35

క. వేడుక దీనులఁ బ్రోచెడి
వాఁడవు నను దీనుఁ బ్రోవవా యిది తగవా
క్రీడాశతసుందరతీ, తాడన... 36

క. ఏరీ నీసరివేలుపు
లీరేడుజగంబులకును హితమతిశ్రితులన్
నేరుపున మనుపు మహాదేవ, తారిపు... 37

క. కందోయికి విందుగ నిను
గందోయిమహానుభావ కనుపట్టవె నా
ముందర సుందరహాసవు, దండడి... 38

క. దురితాగతపరితాప
స్ఫురితాపగఁ బడినవారల దరిఁజేర్పన్
దొర దొరకునె నీవలె నీ, ధరణిన్... 39

క. నరు నక్రూరుఁ గుచేలున్
హరివై పరికించినట్లె యాదుకొనవె నన్
నరు నక్రూరుఁ గుచేలున్, ద్వారగతి... 40

క. నేర్పున నోర్పున సిరు లొన
గూర్పఁగ దరిచేర్ప నీవగుణనిధివి యశం
బేర్పడ సుందరతాశత, దర్పక... 41

క. బంధురకరుణాపూరధు
రంధరుఁడని నమ్మినాఁడ రా నా యెడఁ బం
దంధనము చేయకు సుహృ,ద్బాంధవ... 42

క. నేమమున విస్మరించితి
పామరుఁడను గరుణఁ జేసి పాలింపవె యిం
కేమర నీయడుగుందెలి, తామర... 43

క. బంధురతరై హికాంధుగ
తాంధుం దరిజేర్పవె దయారసవల్లిం
బాధించి తిగిచి వేయకు, దంధన... 44

క. మెఱుపు నురోహిత మిరుగడ
దోఁపసిన ఘనమనమహీజతో లక్ష్మణుతోఁ
జెరయునినుఁ జూచుటప్పుడో, తతి యిఁక...

క. సరిగలరె శూరు లిఁక నీ
కరయంగాఁ బరశురాముసంతటిజోదుఁ
దురమున వెఱపించితి వి, ధ్వరణి... 46

క. కరుణింపవలయు నే నీ
వరసుతుఁడను నెనరుగూర్పవలెఁ దండ్రివి నీ
వరయ ననుఁ గన్నతల్లి యె, ధరణిజ.... 47

క. నెఱ ప్రత్యక్షంబైనను
వెఱవకు మనిపలికి కరుణ వెదజల్లి కరం
బిరిసిన దురితంబుల విడఁ, దఱుమవె... 48

క. తీఱదయా ధీర దయా
సారము వెదజల్లి నన్ను సాకకయున్నన్
వారక భవకలుషం బఘు, తారక... 49

క. ఆదుకొనవైతి విదివఱ
కాదిమదైవాగ్రయాయి యాలంకోరీ
యాదోధిమధ్యసేతూ, తాపన... 50

క. ఓయయ్య రాఁగదవె నా
చాయకు ఫలదానవిహితశబరీసదృశ
శ్రేయస్కర నిశ్శ్రేయస, దాయక... 51

క. ఇప్పటికి నీదుహృదయం
బప్పా నా యెడలఁ గరుగదా యెంగద న
న్నెప్పుడు బ్రోచెదవో దయ, తప్పక... 52

క. నా యెడల నీకు దయరాఁ
దా యెఁగదా పరమనియమతాపసనిచయ
శ్రేయోభూయోజయసం, ధాయక... 53

క. ఇంకన్ దయరాదా నీ
కింకరుదెస హితవిశేషకృతకోమల ని
శ్శంకానుక్రోశనిరా, తంకా... 54

క. కోలగానిబుద్ధి నెఱిఁగి
యెఱుఁగక నేజేయునట్టిహీనపుఁబనులన్
బెరిగినదురితలతల్ తెగఁ, దఱుఁగవె... 55

క. ఎన్నిదురాశలఁ బొరలినఁ
బున్నెము రానేర దాదిపురుషుని నిను బు
ద్ధి న్నిలిపినాఁడ విజయో, త్పన్నా... 56

క. తనలేమి యొరులకలిమికి
జనుఁడు వెతంగుడుదుఁ బూర్వజన్మంబునఁ జే
సినఫలమెంతో యంతియ, తనగతి... 57

క. ఖలమతులనైన సిరులన్
బొలుపొందిన పుణ్యులండ్రు పుణ్యులనైనన్
గలుగనిచోఁ జులుకనఁగాఁ, దలఁతురు... 58

క. స్నిగ్ధభవత్పద భజనా
దుగ్ధరసం బెఱుఁగనేరుతురె మోహార్ఘురీ
దిగ్ధులు సంసారానల, దగ్ధులు... 59

క. ఉడుతయొకఁ డిసుము సేతువు
నిడినంతనఁ గరుణజేసి యేలితివఁట యీ
యెడ నాయెడఁ గృపసేయుట, తడవా... 60

క. శరణన్న యంతమాత్రనె
పరికించి విభీషణునకు బహుతరవిభవ
స్థిరసుఖ మొసఁగినయఖిలో, త్తరుఁడవు... 61

క. పగఁజేసిన కాకాసురుఁ
దెగఁజూడక ప్రోచినట్టిదేవర వని నిన్
బొగడిన ననుఁబ్రోవమి యిది, తగునా... 62

క. ఖగము లొకరెండుబోరఁగఁ
దగవును బాలించి వానిదరిఁ జేర్చిననీ
యగణితకరుణాకృతికే, తగనో... 63

క. బాఁపఁడు గొట్టినశునకము
వాపోవుచు మొఱలుబెట్ట వాత్సల్యముచేఁ
బాపితివి నివిరి మానస, తాపము... 64

క. వాలంపగములతాకునఁ
దూలి సముద్రుండు వేఁడఁ దోడనె వానిన్
లాలించితి వహహా నీ, తాలిమి... 65

క. బవరమునఁ బడినకోఁతులఁ
బవనజుచే మందులొసఁగి బ్రతికించిన మే
టిపి యల్పమె నీకరుణా, ద్రవిణము... 66

క. తప మొకశూద్రుఁడు చేసిన
నెపమున విప్రసుతుఁ డీల్గ నెఱి జీవితుఁగాఁ
గృపఁజేసితి వతులశుభ, స్థపదా... 67

క. నీటన్ బాల్దేలుట విపి
నాటులు భటులొకట గలుగునా భువి మున్నే
నాటన్ గొదువా మఱినీ, ఘాటికి... 68

క. నిరతిక్ నీకృపగల్గినఁ
దిరఁదుగునికిమాత్రమైన దృఢవృద్ధి కిలక్
గుఱినీవుషితోటజవట, తరుతతి... 69

క. కలుములు లేములు జనులకుః
గలలోపలివార్తలట్లు కపటంబగు నిం
వలఁచుట చెడనిపదార్థము, తలఁకొన... 70

క. అమితంబగుసంసార
భ్రమునొందక నిన్ను నమ్మి భావించినయీ
క్రమమునవె పునర్జనిసి, ద్ధముగద... 71

క. కరుణింపవయ్యా నన్నో
సరసిజభవశంకరాది సకలనిలింపా
త్కరపరమహారసుమహా, తరళా... 72

క. మీనవమ్మై సోముకు నం
భోనిధి బోర్గించి వేదములు నలువకు నిం
పూన నొసంగినసుగుణని, ధానివి... 73

క. కూర్మతచే గిరిజలనిధి
యూర్మికలం దేల్చి యమృతమొసఁగి సురారిం
గూర్మిం బ్రోచినసూనృత, ధర్మివి... 74

క. హారాహరూపమున నమ
రారిహిరణ్యాక్షుఁ దునిమి యవనివిషాణో
ద్ధారతఁ జేసినజగదా, ధారక... 75

క. నరసింహామూర్తిగ కొని
పరుషాత్ము హిరణ్యకశిపుఁ బ్రహ్లాదునకై
పరిమార్చితివి భవాంబుధి, తరణివి... 76

క. వామనుఁడవగుచుఁ ద్రోక్కితి
మోమోటము లేక బలిని మూఁడడుగు లిలన్
గామించి మనిపితివి సు, త్రాముని... 77

క. అతులపరశ్వథధారన్
గృతవీర్యతనూజుఁ దునిమి కృతయుగమున నో
ప్పితివి భృగూద్వహ రామా, ధృతి చే... 78

క. కలన భృగురాముపిలుగొను
టెలమిన్ మీ రెండు మహిమ లేకంబగుటన్
గళ కళలోఁ గలిపికొనన్, దలఁచుట... 79

క ద్వాపరమున సుజనులకుం
బ్రాపై యదుకులమునందు బలరాముఁడవై
దీపించితి వమితాఖిల, తాపస... 80

క. ఉద్దవిడి బయటిపల్లెల
ముద్దియలం గుట్టుచెఱిపి పాలతిండిగమిన్
సద్దడఁతు వింక బుద్ధతఁ, దద్దయు... 81

క. వారింతువు మ్లేచ్ఛుల నిఁక
ధీరతచేఁ దామ్రపర్ణితీరంబున నీ
వారయఁ గలి కల్కితనూ, ధారత... 82

క. కొంచక మోహినివై మఱి
వంచించితి వసురవరుల వడి సురలకునై
వించితి వమృతము సుగుణో, దంచిత... 83

క. త్రిపురములు గూల్చునప్పుడు
త్రిపురారికిఁ గొండవింటదివ్యాస్త్రమవై
నిపుణత నెఱపితివి పరం, తపుఁడవు... 84

క. అమరాసురయుద్ధమహిం
గొమరున జీవాతుఁ డెసము గ్రోలితివి మహో
త్తమగతి వైకుంఠంబునఁ, దమకక... 85

క. నిపుణత నీవేగద జగ
దపకారుల సగరసుతుల నందఱఁ బొలియన్
శపియించిన కపిలుం డను, తపసివి... 86

క. భారతపంచమవేదమ
హారచనన్ నీతిమార్గ మలవరచినయా
పారాశర్యుఁడ వీవెక, దారవిూ... 87

క. ఇప్పటికి నేను జేసిన
తప్పులకు మితంబులేదు తాలిమిచే నా
తప్పులు సహియింపుము దయ, తప్పక... 88

క. నాకోర్కె నెవఁడు తీర్చును
నీకొమరుఁడనైతి నింక నెనరుంచవలెన్
శ్రీకరరవివంశాబ్ధిసు, ధాకర... 89

క. ఆసించితి నీకరుణకు
దోసిలి యొగ్గితి భవాబ్ధి తొలఁగితి వెతలన్
బాసితి కుశలుఁడనైతిన్, దాసున్... 90

క. బాల్యుఁడ నిన్నుఁదలంపన్
బ్రాల్మాలితి నిన్న నేఁడు బలికెద నీకుఁ ద
ప్పాల్మలచి కరుణసేయుము, తాల్మిన్... 91

క. ఇల దశరథతనయుఁడవై
యెలమిం బరకొండు వేలయేం డ్లుండుటయున్
మెలఁగుచు భక్తులఁబ్రోవన్, దలఁచుట రఘు...

క. రామా రవివంశాంబుధి
సోమా సుగుణైకధామ శుభకరనామా
శ్రీమహితవిభవజితసు, త్రామా... 93

క, రాజీవబాంధవాయుత
తేజోనిక్షేప యప్రతీపసురూపా
రాజితకారుణ్యసము,ద్భ్రాజిత... 94

క. విశ్వామిత్రమఘావిహిత
విశ్వపలాశాశితూల విశ్రుతపటలీ
శశ్వద్ధూనన నవపృష, దశ్వా... 95

క. ఆసారసత్కృపామృత
కాసార! గుణాంతరంగకమనీయగుణ
వ్యాసంగవిమతజననం, త్రాసద... 96

క. గహనాటసైన్యసేవిత
గుహనామకిరాతవినుత గుణధూర్వహనా
గుహనాసురవంశదహనీ, దహనా... 97

క. ప్రాచేతసకవికవితా
వ్యాచిక్రీంసాభిరామ హార్షితహృదయా
యాచకకాంక్షాఫలసం, ధాచణ.... 98

క. మామవ తవ దాసోహం
కామితఫలద ప్రభావకరుణాసింధో
త్వామేవ నహి శరణ్యం, ధామగ... 99

క. శ్రీమద్భూమశుభప్రద
నామజ్ఞ త్వా మంతరేణ నహి శరణం మే
మా ముద్ధర భద్రాచల, ధామా... 100

క. ప్రాచుర్యసమధికమనీ
షాచణ దిట్టకవిరామచంద్రునిశతకం
బాచరణ సేయనగు భ
ద్రాచలరఘుతిలక నిటలతటనటదలకా. 101

రఘుతిలకశతకము
సంపూర్ణము.

---

# పీ ఠి క

ఈశతకగ్రంథకర్త దిట్టకవిరామచంద్రకవి. ఇతఁడు వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడువారి యాస్థానకవిగఁ జిరకాల మమరావతిలో నివసించెను. అమరావతిలోని యమరేశ్వరాలయమునందలి మహిషాసుర మర్దనిని గూర్చి యీశతకమును గవి రచించెనని వంశీయులు చెప్పుచున్నారు ఈకవి శకుంతలాపరిణయము, సేతుమాహాత్మ్యము, రామకథాసారము రచించిన దిట్టకవిపాపరాజుగారి మనుమఁడు. రంగారాయ చరిత్రము వ్రాసిన నారాయణకవిపుత్త్రుఁడు. ఈరామచంద్రకవి నిగ్రహానుగ్రహసమర్థుఁడు, ధూర్తుఁడు. ఇతనికవిత నిరర్గళధారాశోభితమై మనోజ్ఞముగా నుండును. ఇంతవఱ కీకవిగ్రంథములలో నీక్రిందివి మాత్రము లభించినవి:

1. ఉద్దండరాయశతకము
2. రఘుతిలకశతకము
3. రాజగోపాలశతకము
4. మహిషాసురమర్దనిశతకము
5. హేలావతిదండకము
6. ప్రబంధములోని కృత్యాదివాసిరెడ్డివారి వంశచరిత్రము.

హేలావతిదండకము రెండవభోగినీ దండకమువలె నున్నది. రచనయుఁ గవితయు ధారయు హృదయంగమముగానున్నది. కృత్యాదియే ప్రబంధమునకు ముందుభాగమో నిరూపింప వీలు కాదయ్యెను. రామచంద్రకవి సత్కారము జరుగనిచోటులఁ దిట్టు కవిత నుపయోగించి బెదిరించి బహూకృతు లందిన గడుసరి. ఈయనను గూర్చి యనేక విచిత్రకథలు వాడుకలో నున్నవి. కవి తనప్రగల్భము నొకచాటువులఁ జెప్పుకొనియున్నాఁడు.—

క. దిట్టకవి రామచంద్రుఁడు
దిట్టిన బాఱైనఁ బగులు దీవించిన యా
బెట్టైనఁ జిగురుఁ బెట్టును
గట్టిగఁ దొల్లింటి మకవి కాఁబోలుఁజూ.

ఈకవిచాటు పద్యములు సమకాలికులనుగూర్చిన ప్రశంసాపద్యములుగూడ మాకుఁ గొన్ని లభించి యున్నవానిని వరుసగాఁ బ్రచురించెదము. రామచంద్రకవి నివాసము కృష్ణామండలము నందిగామతాలూకాలోని గొట్టుముక్కల. కాశ్యప గోత్రము. కవికాలము గ్రహించుటకు గ్రంథాధారము లంతగా లభింపలేదు. కవివంశీయులవద్దనుండి వ్రాయించి

తెప్పించినసనదు కొంతవఱ కాధారము కాఁగలదని యిట నుదాహరింతుము.

"శ్రీమత్సకల గుణసంపన్ను లయ్యె శ్రీమహామ్మేరుసమానధీరులయిన దేవరాజు వెంకటాచలంకు నారయ్య గారు దండం వ్ర ౧౧౭౯ ఫసలి। మ॥ పెదముద్దాలి॥ వ॥ పుయ్యూరు తాలూకు దిట్టకవి రామచంద్రుఁడిగారి మాన్యము హా॥ సా॥ పంట్లకు సాలంబాదుచొప్పున సర్వదుంబాలా శెలవు యిచ్చినాము. మహాస్సులు కమామిషు చేయించొకాని కొంచ్చపోనియ్యవలెను. వికృతినా॥ సం॥ జ్యేష్ఠ శు ౨ నారయ్య వ్రాలు"

ఇది సూజవీటిసంస్థానోద్యోగి కవిమాన్యము ఫలసా సుము విషయములో తాణేదారునకు వ్రాసిన యాజ్ఞాపత్రము. ఇట్టివె ఫసలి ౧౧౬౭, ౧౧౬౯, ౧౧౭౦ లోనివిగూడ కవివంశీయులవద్ద మేము చూచి యున్నారము. ఇపుడు 1334-వ ఫసలీ కావున మనకు లభించినవానిలో మొదటి యాజ్ఞాపత్రము గు ఫసలి 1168 సం. సనదు ఇప్పటి 166 సంవత్సరముల క్రిందఁ బుట్టియుండును. కవి యప్పటికి 20 సంవత్సరములవాఁడైనచో కవిజన్మకాలము క్రీ. శ. 1781 ప్రాంతములయందై యుండును.

కవిగ్రంథరచనకాలము సమకాలికులను జీవితమునుగూర్చి ప్రత్యేకించి వ్రాయనున్నారముగావున నిందు విరమించితిమి.

ఈశతకమునందలి భావములు సరళముగ హృదయంగమముగ నున్నవి. ధారయు నిరర్గళముగ నున్నది. ఇట్టి యుత్తమశతకము కవివంశీయులగు విజయరామశాస్త్రులవారు తాళపత్త్రగ్రంథములనుండి చిరకాలముక్రిందట నెత్తివ్రాసిరి. అందుఁ గొన్ని స్ఖాలిత్యము లుంటచేఁ గవ్యభిప్రాయానుగుణముగ సవరించి శుద్ధప్రతి నేర్పఱచితిమి.

ఈకవికృత గ్రంథములన్నియు ముద్రణమునకు నొసంగి శుద్ధప్రతి పీఠికవ్రాయుటకు మాకవకాశము కల్పించిన కవివంశీయులగు దిట్టకవి సుందరరామయ్యశర్మ పాకయాజిగారును, శతకసంపుటములలో నీయమూల్యగ్రంథములఁ జేర్చిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారును ఆంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులు.

నందిగామ. 20-4-25 } ఇట్లు భాషాసేవకులు
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీరస్తు.

దిట్టకవి రామచంద్రకవిప్రణీత

# మహిషాసురమర్దనిశతకము.

---

ఉ. శ్రీవనితాసరస్వతులు చిత్తమెలర్పఁగఁ గ్రేవలన్
భవ, ధ్యానమెఱింగి సేవనెఱపన్ సురపంక్తి
భజింప లోకముల్, వాపిరి నేలు నీకు నను
వారము మ్రొక్కుదు హృద్యపద్యగ, ద్యావలి
నామతించి మహిషాసురమర్దని పుణ్యావర్ధనీ. 1

ఉ. జౌనని యాజగజ్జనకుఁడైన మహేశునకంటె
లెస్సగాఁ, బూని సమస్తలోకములు పోషణ
జేసెడి తల్లివౌకదా, జానుగ నన్ను షణ్ముఖుని
చాడ్పున మన్ననసేయవమ్మ నీ, కానతి సేతునమ్మ
మహిషా... 2

ఉ. తారకపర్వతాగ్రపరితఃపరిపుష్పితసత్కదంబకాం
తారసభాంతరస్థలసుధాకర రత్నమృగేంద్రపీఠి
పైఁ, జేరి జగంబు లేలుశశిశేఖరగేహిని వైన
నిన్నుఁ జె, న్నార భజింతునమ్మ మహిషా... 3

చ. అమరులు నీకుసైన్యతతు లాగమముల్ స్తుతివంది
పాఠకుల్, రమ చెలికత్తె శారదచిరంటి సురా
లయముఖ్య సర్వలో, కములకు నీవ యీశ్వరివి

కావున మ్రొక్కెద నీపదాబ్జదా, స్యము దయ
సేయవమ్మ మహిషా... 4

చ. శుభములొసంగ సత్కరుణఁజూడ నికెవ్వరు
నీకెచెల్లు వి, శ్వభరిత యోకదంబ వనవాసిని
యోసువికాసినీ నిజం, బభినుతిజేతు నీపదము
లాత్మదలంచి యహర్నిశంబు నా, కభయ మొసంగు
మమ్మ మహిషా... 5

చ. అకలుషవృత్తి నిన్గొలుచునంతనె యంతటి
వానినైన న, మ్మికజనియించి కష్టముశమించి ఫలిం
పకయున్నె మేలుమేల్, ప్రకటసుఖంబు కంబుసు
గళాబగళా యఖిలాండకోటినా, యకివిగదమ్మ
మహిషా... 6

చ. నిమిషముమాత్ర మంతె మది నిన్నుఁదలంచిన
వాని కెన్నఁడున్, శ్రమజనియింప దెన్నఁడు
సుఖంబుగ సన్మణిశేఖరి సిల్పి తా, నమితసువర్ణపుష్ప
ముల నర్చనఁజేసెడు పుణ్యమూర్తిభా, గ్యము
తరమా నుతింప మహిషా... 7

ఉ. నీసరివేల్పునీవె మఱినిన్న దినమ్మినవాని కెన్నఁడున్,
నీసరపోవ దెన్నఁడును విశ్రుతసంపద యోకదం
బసం, వాసిని యోమదంబ ననువారము నీకరు
ణారసంబుఁ జే, రాస యొనర్చినాఁడ మహిషా...
8

చ. దనికుల మర్త్యకావళి కదంబవనంబు నివాసమిందు
ఖం, డము తలపువ్వు భూషణ మనంతుఁడు చేతు
లసుం త్రిశూలచ, క్రములును బ్రహ్మాదండభిదు
రంబులు సాధనముల్ మహోగ్రసిం, హముగద
వాహనంబు మహిషా... 9

ఉ. ఆసరసీజనేత్ర హారహాటకగర్భుల కెన్నరానినీ,
వాసిదలంచి చూడఁగ నవాఙ్మతి మానసగోచరం
బగునె, నీసరిమేటి నీవెకద నీకొకలక్ష్యమె చండ
ముండభం, డాసురఖండనార్తి మహిషా... 10

చ శరణని వేఁడినాఁడ ననుసాదు మటంచుఁ దలంచి
నాఁడ నీ, వరతనయుండనౌట నను వారము
నెమ్మది నమ్మినాఁడ సుం, దరకరుణాకటాక్షకలితా
లలితాలలితారిగర్భసం, హరవికటాట్టహాసమహి
షా... 11

ఉ. ఎక్కడివాఁడనీ వనక యించుక నీకరుణాసనంబు
నా, దిక్కనఁ బాదుకొల్పి ప్రణిధిస్థితిగైకొని
రిక్కలోవిడం, ద్రొక్కవె యిక్కడో యములు?
మ్రొక్కెద మ్రొక్కెదఁ బెక్కుమాఱు లో,
యక్క భరింపవమ్మ మహిషా... 12

ఉ. జన్మత నాకుఁడంగలదు సత్యముగా జననీప్రభా
వజ్ఞా, జన్యము నీవు దాల్పు మిఁక సంశయమేటికి

నీకృపాప్తిచే, ధన్యుఁడనైతి నీమృదుపదంబులు
నమ్మినవాఁడనైతినీ, కనుఁగానుసుమ్ము మహిషా.

ఉ. ఎల్లిదమేల యమ్మ కృపయేర్పడ మార్పడఁ జూడ
నట్టినా, తల్లివి నీవెగాన బహుధా భవదంఘ్రుల
నాశ్రయించె నా, యుల్లము నెల్ల వేలుపుల
నొల్లక వేల్లితఫుల్లమల్లికా, హల్లకనీలవేణి
మహిషా... 14

ఉ. ఎవ్వనిపట్ల నీకరుణ యించుకగల్గునో వానికి
న్నెఱా, నివ్వటిలుఁ సిరుల్ యశమునిందు
కృతార్థతగల్గు శాత్రవుల్, దవ్వగుచుంద్రు సత్య
ముగదాయిది కావున నిన్నెగొల్తునో, యవ్వ
నిరంతరంబు మహిషా... 15

ఉ. పొందుగ స్తన్యపానపరిపూరితుఁడై గుహుఁడు
బ్బి ముందఱఁ, జిందులుద్రొక్కఁ దన్ముఖశశింగని
ముద్దొనరించి మానసా, నందముతోడఁ గన్గొ
నెడినాఁటిదయాకృతి నాపయిఁ విని, ప్పొంద
మొనర్పవమ్మ మహిషా... 16

ఉ. అమ్మలయమ్మ నీ వలరుటమ్ములవాఁ డగువానిబ్రే
ల్చురో, స మ్మలరారువెండిమలసామికి నేలిక
సానివమ్మ నా, యమ్మగునీవు భక్తజనతావనమో
మలరాచపట్టినా, యమ్మవు నీవెసుమ్ము మహి...

ఉ నీమహనీయసత్కరుణ నిర్మలమౌగద నీప్రభావ
ముల్, స్థేమమెలర్ప సేవకవిధేయములౌగద
ప్రోవు మింక న,న్నోమిక చేసి యోలలిత యోభ్ర
మరాంబిక యోభవాని యో,హైమవతీమదంబ
మహిషా.... 18

ఉ. మానుగ నీవు నీశ్వరుఁడు మత్పితృదేవతలైనఁ
జాలు మీ, కేను తనూభవుండనయి యింపుగ
మీకరుణామృతంబునే, బూనెడిసొమ్ము తెమ్మ
నుచుఁ బోరొనరించి గ్రహింతునమ్మ మీ, కానతి
సేతునమ్మ మహిషా... 19

ఉ. దక్షత నన్నపూర్ణయును ధన్యయశంబువహించి
కాశిలో, భక్షణ సేయుఁ దం చమృతపాయస
మాశ్రోనువారికెల్లఁ బ్ర,త్యక్షముగా నొసంగు
చుఁ ప్రియంబున లోకము లేలుశ్రీవిశా,లాక్షివి
నీవెసుమ్ము మహిషా... 20

ఉ. పోలఁ గపాలమాలికలు బూని విభూతిధరించి
మించి శ్రీ,శైలమునందు శంకరునిసన్నిధిఁ బెన్ని
ధివోలె లోకముల్, పాలనసేతు వీవు ప్రతిభన్
భ్రమరాంబ యనం దనర్చి యో, యైలబిలార్చి
తాంఘ్రి మహిషా... 21

ఉ. తోరపుహేలచేఁ గనకదుర్గయనన్ బెజవాడ

లోపలఁ, జారుసువర్ణమూ _ర్తివయి శై లతలం
బున నిల్చి కార్యని, ర్ధారణధర్మమర్మకు వరంబు
లొసంగినతల్లి నిన్నుఁ జె, న్నార భజింతునమ్మ
మహిషా... 22

చ. చలమున లంకలోపలను శాంకరినావిలసిల్లి రక్క
సుల్, గొలువ సమ _స్తలోకములఁ గూరిమి నేలు
దువమ్మ చిన్ని వె, న్నెలదొరపూవుపెన్నెఱుల
నెక్కొనుతల్లి తనూలతాజితా, త్యలఘుసువర్ణ
వల్లి మహిషా... 23

ఉ. తాళదళై కకర్ణికలు దాలిచి వేసలి చందమా
మయుఁ, వ్యాళకలాపముల్ చిఱుతవన్నియ
చీరెలు భూతిరేఖలుఁ, జాల నలంకరించు
కొని చక్కనిబొబ్బమెకంబునెక్కి వా,హ్యాళి
యొనర్చుతల్లి మహిషా... 24

చ. అమృతపయోధితీరమున నాచితకాంచనరత్నపీ
ఠిపై, నమరులుగొల్వ బిల్వవనమందు సురద్రుమ
మూలసీమ సం,భ్రమమెసఁగఁ వసించి గరిమఁ
జగమేలుచునున్న నిన్ను ని,త్యము భజియింతు
నమ్మ మహిషా... 25

ఉ. కోమలనీలవర్ణపటగు _ప్తనితంబిని వై సువర్ణరే
ఖామహనీయతాళదళకర్ణికనింపుదలిర్పఁబూని సో

ద్ధానుధృతిఁ జగత్త్రయము ధన్యతనే లెడుతల్లి
నీవెకా, శ్యామలనాఁదలిర్చి మహిషా... 26

ఉ. సంకుమదాభిచర్చితకుచద్వయ యోరమణీయర
త్నాతా,టంకని యోవిశాకరవిడంబనకమ్రముఖబింబ
యోమహే, శాంకవిభూషణాంగి భవదర్భకు
నం గరుణించుపట్లని,ట్లంకిలి సేయు టేల మహి...

ఉ. లాలితరత్నవీణ నుపలాలనఁ జేయుచు మందహా
సయు,క్తాలపనైకగీతముల నర్మిలిఁ బాడుచు శంభు
సన్నిధిఁ, జాలవిలాసమొప్ప సురసజ్జలరంజిల
నాట్యకేళిచే, హాళిదనర్చుతల్లి మహిషా... 28

ఉ. స్వాదురసాప్తిగీతములు సల్పెడువేళ విలాసవై
ఖరిఁ, మేదుర నీపపుష్పపరిమిశ్రితచందనపుష్ప
మాలికల్, మోదముచే ధరించి నయముం
బ్రియముం బ్రకటించి శంభుచే, నాదృతిఁగాంచు
తల్లి మహిషా... 29

ఉ. ఆతతసత్కృపాప్తి ననునాదృతి సేయఁగదమ్మ శే
ఖరీ, భూత సుధాంశుబింబ పరిభూషితచూళిక
వైనశ్రీజగ,న్మాతవు నీవు శంభుఁడెనుమా పితవేద
ములట్లపల్కు నా,హా తలిదండ్రులంచు మహి...

ఉ. కామమహీపతిస్ఫురితకార్ముకరూపవిరాజమానసు
భ్రూ మహనీయవల్లికకుఁ బుష్పమునన్ గమనీయ

రోచనో, ద్దామలలామ మాస్యమునఁ దాల్చిననీ
మహనీయమూర్తినే, నామతి సేతునమ్మమహి...

ఉ. మంజులఫాలికాకలిత మౌక్తిక కాంతులనంతతుల్
నెఱా,రంజిలుగండభాగముల వ్రాసినకస్తురిగ్రాలు
తేంట్లమ్రోఁ, తం జిగియైనతంత్రినినదంబునగీతము
లుగ్గడించునీ, కంజలిసేతునమ్మ మహిషా... 32

ఉ. తాఁపలమొప్పు వల్లకిని దంత్రులగోటను మీటు
నప్పు డెం,తో వెస గర్ణభూషణము లుయ్యాల
లూఁగఁ గ్రమక్రమంబునన్, గేవలమాధురీమ
హితగీతులఁ బ్రీతుని జేతు వీశ్వరున్, హాపవి
శుద్ధిగూర్చు మహిషా... 33

ఉ. దివ్యసురామదోచ్ఛలిత దీర్ఘదృగంచలమైనమో
మునన్, నవ్యములైన మోదకకణంబులు దోఁచె
ననం దనర్చు సం,భావ్యము లైనముత్తెము
లభాసిలు ముంగరగల్గుతల్లి నీ, వవ్యయమూర్తి
వమ్మ మహిషా... 34

చ. నలువున మందమందమగునవ్వున ముష్మరమైన
మోమునన్, సలలితమౌక్తికాప్తిఁదగు సద్రద
పాళికిఁ బాటలచ్ఛద,చ్ఛలనతఁదాల్చి వీడియపుఁ
జాయల వాతెఱసొంపు బెంపునిం,పలరెడుతల్లి
వీవ మహిషా... 35

ఉ. ఆకమనీయదివ్యనవయౌవన చంద్రకళోదయంబు
చేఁ, బ్రాకటలీలయఁ జలధిపై కొనఁ దత్పరిదృశ్య
కంబు బి,బ్బోకవదాత్మకంధరము బొల్పెసలారఁ
దనర్చుతల్లి నీ, యాకృతిసంస్మరింతు మహిషా...

చ. విలసితరత్నముద్రికలు వ్రేళ్లధరింపఁ దదీయదీధి
తుల్, వలకొని సాంధ్యరాగములధర్మముఁ దాలి
చి కెంజిగుళ్లలీ,లల నఖపంక్తికిం జిలుగులత్తుకగాఁ
గళలుబ్బుతల్లి న, న్నలరఁగఁ జేయవమ్మ మహి
షా... 37

ఉ. మేదురరూపయౌవనసమృద్ధియనం దనరారువా
ర్ధికిఁ, జోదపుంబూఁతగల్గు చనుగుత్తులవ్రేగునఁ
దూఁగుకొనుపై, భేదములౌతరుల్ తరళవీచులు
గా విలసిల్లుతల్లి న,న్నాదుకొనంగదమ్మ మహి
షా... 38

చ. పరగ గభీరనాభి యనుబావికిఁ గ్రేవఁ దనర్చు
నాచుక్రొం, బొరయననొప్పు నాయుదరభూషణ
మైవిలసిల్లుసత్కటీ,నిరుపమసూత్రనిక్వణన నిర్జిత
మారగుణార్భటీ మనో, హరనిధి వైనతల్లి
మహిషా... 39

చ. చెలువుగఁ బద్మరాగములు చెక్కినచక్కని మేఖ
లఁ సము,జ్జ్వలమగుశ్రోణిచేఁ గనకశైలనితంబ

ము ధిక్కరించి పిక్కలచెలువంబుచే మరునికా
హళకాండధులఁ హసించుదో,హాలశంగలట్టితల్లి
మహిషా... 40

చ వికసిత కింశుకప్రసవవిశ్రుత తామ్రపటాభిగుప్తస
క్థిక మృదుభావలక్ష్మిపరికీర్తిత కుంకుమపంకలిప్త
హాస్తికకరలక్ష్మిఁ గేర శివదేవుని గేహిని వైనలో
కనాయకివిగదమ్మ యమ్మ మహిషా... 41

చ జయజయ దేవతామణివిశాలసముంచితపీఠవా
సినీ,జయజయ గంధసారఘనసారసుధారసమంజు
భాషిణీ,జయజయ శంకరార్ధతనుసంగవిలాసిని భా
స్వరాప్సరో, హాయముఖసన్నుతాంగి మహి
షా... 42

చ. జయ జనయిత్రి శోభనవిశాలసుగాత్రి తుషారన
చ్ఛిలో, చ్ఛ్రియవరపుత్రి నిత్యజలజప్రసవాంచిత
నేత్రి సత్కృపా, నయరసపాత్రి నిన్నిఁక ననార
తముం భజియింతు నన్ను నవ్యయదయఁ జూడ
వమ్మ మహిషా... 43

ఉ. ఆదరమొప్ప శంకరుని యర్ధశరీరము నాశ్రయిం
చి భాగ్యోదయలీల మాధవునిసోదరివన్న ప్రసిద్ధి
గాంచి యష్టాదశపీఠముల్ భువిప్రసన్నతకెక్కి
జగంబులేలు నయ్యాదిమశక్తివీవె మహిషా...

ఉ. సోదరి వంబుజాక్షునకు శూలికి నేలికసాని వమ్మ
హా, వేదికి ముద్దుకోడలవు విష్ణుపతిప్రియమాత
వెన్నఁ, గా నీదయ చేఁగదా నిఖిలనిర్జరకోటులకుం
జయంబు న, న్నాదృతి సేయవమ్మ మహిషా...45

ఉ. తోరమెలర్పఁగాఁ గనకదుర్గయనన్ బురుహూ
తికాంబనా, నాఁయ జోగులాంబ భ్రమరాంబ
యనన్ మొదలైనలీలలం, బార వహించి కాంచి
మొదలైనపురంబులనిల్పి విన్నపం, బారసి ప్రోతు
వమ్మ మహిషా... 46

చ ఘనముగఁ గాశికాపురిని గాంచిన నుజ్జయినిం?
బురాపురం, బున బెజవాడలోనఁ బరిపూర్ణకృపా
రసపుణ్యమూర్తివై, జననుతకీర్తిచే నిలుచుచా
ద్భుత నాహృదయంబునందు నీ, వనయము నిల్వ
వమ్మ మహిషా... 47

ఉ. హారిబలప్రభావమున హైమవతీ బగళాముఖీ
ప్రచం, డారణ్యభైరవీ ప్రముఖనామములన్ నవ
కోటిరూపముల్, ధీరతఁ దాల్చి ముఖ్యముగ దీ
కొని లోకము శేలునట్టి కా, మారివధూటివీవు
మహిషా... 48

చ అకలుషపారిజాతనగ మల్లిన మొల్లపునాగవల్లి
నా, సుకరముగాఁగ శంభుని విశుద్ధశరీరము

గౌఁగలించి వ్రజ్రకళను శక్రనీలమణి ప్రభ్భినరీతిఁ
దనర్చునిన్ను బ్రహ్మాకుఁ దరమా నుతింప
మహిషా... 49

ఉ. చేకొని నీసతీత్వము ప్రసిద్ధిగ సార్థతదాల్పఁ బ్రా
ణనాథాకృతి నాశ్రయించుతఱి నర్మిలిలోఁగు
దు వంతకంత న్వల్పాకృతిఁ బూని దీనికి మహం
బునిధిఁ జలజాప్తజాప్రవాహాకృతి సాక్షిగాదె
మహిషా... 50

చ. ముకురము కేలఁ బూని నిజమూర్తిసమాశ్రితస
త్స్వరూపభావకము పరీక్షఁ జూపి మగవారలస
న్నిధి నాఁడువారియో, మిక యది యెంతమాత్ర
మని మేలపుమాటలచేతఁ బ్రాణనా, యకు నల
రింతువమ్మ మహిషా... 51

ఉ. శోభితమా జపస్ఫటికసూత్రముద్రిప్పుచు పుస్త
కంబు లీలాభృతయోగదండమువిలక్షణమొప్పఁ
గదంబవల్లికో, ల్లాభము క్రింద నాత్మకమలంబునఁ
దారకనామమంత్ర మాహా భజియింతు వమ్మ
మహిషా... 52

ఉ. ప్రేమదలిర్ప నందియును భృంగిమొదల్ గవనాట
సిద్ధులు, ద్ధామత నాడఁ జూచుచుఁ బృథగ్విధిఁ
జూతువు మూఁడులోకముల్, నీమది లోకరక్ష

ణవినిద్రము భక్తజనావనక్రియా, యామదయా
భిరామ మహిషా... 53

చ. ఇభముఖకార్తికేయులను నిద్దఱు పుత్త్రుల పిమ్మ
టన్ భవత్ప్రభుండ లాఁతిగాఁ దలఁపఁ బాడి
యె తల్లివి గావునన్ సదా, విభవము వేఁడినాఁ
డఁ గనువిచ్చి కనుంగొనికొ మ్మటంచు నా,యభి
మత మీయరమ్మ మహిషా... 54

ఉ. వేదపురాణశాస్త్రములు వేయుముఖంబుల నిన్
భజించు న,వ్వేది యెఱుంగఁజాలఁ డతివిశ్రుత
మైనభవత్ప్రసాద మా, పాదన మాచరింతువు
కృపారసదృష్టిని గారవించి యిం, ద్రాదులకున్
శుభంబు మహిషా... 55

ఉ. లోక మనేకలీలల విలోభము లేక భరింతు వా
శ్రితో, త్సేకశుభంబు నీకరుణచేత ఫలించుచు
నుండు దేవతా, నీకము నీకుటుంబ మిదినిక్కము
నిన్ను భజించుపట్ల న,వ్యాకులబుద్ధినిమ్ము మ...

చ. సురలకు జీవకఱ్ఱవు త్రిశుద్ధిగ మానిజనాళికిన్
సుధా,సరసివి దీనపోషణవిచారము నీకుస్వభావ
సిద్ధమై, పరగినచిహ్నమౌఁగద ప్రసన్నవు నీవనిన
మ్మినాఁడ న,న్నరసి భరింపవమ్మ మహిషా.... 57

ఉ. ముప్పదిమూఁడుకోట్లసురముఖ్యులుమానులు చేరి

కొల్వై కదా, తెప్పల సత్కృపారసము నింపుచు
సంపదలిచ్చుతల్లి ని,న్నెప్పుడు సంస్మరింతు ప్రియ
మేర్పడ వన్ననసేయవమ్మ మా,యప్పవు నీవ
సుమ్మ మహీంపా... 58

ఉ. ఈధరణీతలంబున నిఁకెవ్వరు సత్కరుణానుభూ
తిచే, సాధులబ్రోచుసాధకులు సత్యము మజ్జన
యిత్రివైతి వో, భూధరరాజపుత్త్రిమణిభూషణ
భూషితసన్నుతాంగి వి,ద్యాధర పూజితాంఘ్రి
మహీంపా... 59

ఉ. నీవహనీయతేజ మదనీరజబాంధవు నిగ్రహించు
నీ, తామరసప్రసూనముఖధన్యత జాబిలి మేల
మాడు నీ,భూమదయారసం బమృతపూరము నే
రముటెంచుచుండు నో, శ్యామలకోమలాంగి
మహీంపా... 60

ఉ. మిక్కిలిసత్కృపదా దృణము మేరువుచేసెడితల్లి
వాటచే, నక్కట పెక్కుసంపదల కాసయొనర్చి
తినమ్మ మ్రొక్కుటల్, నిక్కముసుమ్మ నీచరణనీ
రజముల్ శిరసావహింప నా,కక్కఱసామ్ములమ్మ
మహీంపా... 61

ఉ. కారణమూర్తివీవు మురఘస్మరసోదరి నీకృపారస
స్ఫారనిరీక్షణస్థితి నభశ్చరకోటులు వృద్ధిగాంతు

రిం, పారఁగ నీవయొద్దడ మహర్షుల కెల్ల నిరంతరం
బు నీ, వారకుభృత్కుమారి మహిషా... 62

ఉ బంధుర హారహారచయ భాసితకంధర యోమదం
బ యో, సింధురయాన యోమణివిశేషకలాప
లసద్భుజాగ్ర యో, గంధిలపుష్పదామ పరికల్పిత
కైశిక యస్మదీయభా, వాంధత మాన్పవమ్మ మ
హిషా... 63

ఉ. దేవకుటుంబినీమణులు దిక్పతికాంతలు మ్రొక్కి
చెక్కులన్, వావిరివ్రాయుపత్త్రికలవశ్యము సస్య
మటన్న శంకచే, భావనసేయు నిర్జగలపాదనఖేం
దువులొప్పుతల్లి ర, మ్మా వనటల్ నశింప మహి...

చ. హరిహయముఖ్యదిక్పతు లహర్నిశ మానతి
సేయఁ దన్మనో, హరమకుటాగ్రవజ్రఘృణు
లర్ఘ్యము పాద్యము గంధ మక్షతల్, నెరిఁదిరు
లంచుఁ జాలఁ గరుణింతువు నమ్మినవారిపట్ల నీ, క
రమర లేదు సుమ్ము మహిషా... 65

చ. మహితవహించి నారదుఁడు మంధరమధ్యమతార
కంబులన్, బహుళము లైనగీతములు బాడఁగ
నచ్చరలాడఁగా శుభా, వహముగ నోలగంబమరి
వత్సలతం జగమేలుతల్లి ని, న్నహరహముం
భజింతు మహిషా... 66

చ. వినుతముకుందకుందముఖవేష్టితవై యమరీభుజం
గకో,పన లిరువంకలంగొలువ భైరవసేవితవై
తనర్చి హెచ్చినకృప సింహపీఠికవసించి జగత్త్ర
యమేలుతల్లి ని,న్ననుదినముఙ్ భజింతు మ...

చ. వరుసదలిర్ప తారకులు వామమొదల్ గలశ
క్తులుఙ్ సముద్ధురగతి సప్తమాతృకలు తుంబు
రునారదముఖ్యులుఙ్ భవచ్చరణము లాశ్ర
యింప ననిశంబుఁ గుతూహలలీలచే మనో,హా
రత వహించుతల్లి మహిమా... 68

చ. సకలవచోవిశారదము చందుకళాజితబంధుజీవకిం
శుకము శుకంబు పాణిపయి శోభిలి చాటువులు
గ్గడింపఁ ద, త్ప్రకటితవాక్యమాధురికి భావము
నఙ్ ముదమందుతల్లి ని, న్నకలుషభక్తిఁ గొల్తు
మహిమా... 69

ఉ. కారణమీవమాకు మముగావు మటంచుఁ దలం
చినంతనే, ఘోరరణస్థలిఙ్ దనుజకోటులగీటణఁ
గించి మించునీ,శూరత యేమిచెప్ప బలసూదన
ముఖ్యుల నిర్వహించి చె,న్నారఁగఁ జేసినావు
మహిమా... 70

ఉ. ఊర్జితసంపదల్ ప్రియమునొంద నొసంగి దయా
రసైకస,మ్మార్జన మాచరించి నను మన్ననసేయఁ

గదమ్మ సర్వథా, వర్జితకల్మషుండనయి వర్ధిలఁజేయఁ
గదమ్మ సాత్వికో, పార్జితకీర్తులిమ్మ మహిషా...71

చ. అమర భవత్పదాబ్జముల కానతులై నుతిసేయు
వారికిన్, సముచితధర్మసంగ్రహాణసత్వవిచారప
రోపకారకా, ర్యముల నొడాట మందు ననయం
బు జయంబులెగాని యంతరా, యము లివిలేవు
సుమ్ము మహిషా... 72

ఉ. ఎంతని సన్నుతింతు నిఁక నేగతి నీపదపల్లవంబు
లర్చింతు భవత్కృపారసవిశేషము లేగతిఁ గాం
తు జాడ్య మిం, తింతనరాదు నామది కవాసవా
నంబు వహించుభారకం, బంతయు నీదె సుమ్ము
మహిషా... 73

ఉ. మందుఁడ భావిదర్శనసమర్థుఁడఁగాను భవత్ప్రభా
వముల్, పొందుగ సంస్మరించుటకు బుద్ధిదలిర్పదు
జ్ఞానహీనుఁడన్, నందనుపట్ల తల్లి కొకనాఁడును
నేరము లగ్గమానె నా, యందును నట్ల నీవు
మహిషా.... 74

చ. ఖలులకు వేయుసంఖ్యలముఖంబులు వేయుభుజా
యుతం బసం, ఖ్యలుకరవాలముల్ గలుగఁగన్పడు
చుందువు శిష్టకోటిచూ, డ్కల కమృతస్వరూప
ము కడుం బ్రకటింతువు సత్కృపన్ ద్విధా, య
లరెడుతల్లి నీవు మహిషా... 75

ఉ. ఈత్రిజగంబు లేలుటకు నీశ్వరి వీవు విమర్శనీ
యగా, మాతృకవీవు సంతతికి మానులు వేల్పు
లు నీప్రభావముల్, నేతురె సన్నుతించుటకు
నీవిభుఁ డాదిమద్రైవమూర్తి నీ,ఖ్యాతిమహౌఘ
నంబు మహిషా... 76

ఉ. అప్రతిమాభిమానవిధివర్ధులకర్థ మొసంగుపట్ల నీ,
సుప్రథితప్రభావగుణశుద్ధికృపారసమిశ్రితంబు వి,
శ్వప్రభువామభాగమున శాశ్వతరీతిఁ జరించు ని
త్యసత్యప్రసవాంబ నీవు మహిషా... 77

చ. అనిమిషకోటికై రణసహాయముగైకొని నిల్పి జి
హ్వాచే, దనరఁగ రక్తమూర్పుఁగొని తత్పురుద్భ
వరీతి మాన్పుచుఁన్, సునిశితకంతకోణముల శుం
భనిశుంభుల ద్రుచ్చినట్టిని, న్నునిశము సంస్మరింతు
మహిషా... 78

ఉ. భానుఫలంబుగాఁ దలఁచి పావనిమ్రింగి తదుష్మఁ
గ్రాగుచుఁన్, గ్లానిపహించి వ్రాలనెడఁ గంధి
నెదుర్కొని పట్టి ఆోమ్మునన్, బూని తనూజుఁ
డంచుఁ జలముఁన్ బలమిచ్చి కృపం బయోరసం,
బానఁగ నిచ్చినట్టి మహిషా... 79

చ. భృశకలితైకభక్తి వినుఁబేర్కొని పూజలొనర్పఁ
దన్మనో,వశత వహించి పుత్త్రుఁడనువత్సలభావము

నించి మించి ప్రా,యశముగఁ గాళిదాసుని మ
హాకవిగా నొనరించినట్టినీ, యశము నుతింతునమ్మ
మహిషా... 80

ఉ. నీరధులేడు నొక్కటిగ నిండినయంతటికన్న మి
న్నయ్యె, పారములేని నీకరుణఁ బ్రస్తుతిఁజేయఁద
రంబె యెరికిన్, సౌరగణాహిజాలమనుజవ్రజసం
చితసంపదాగమ, ద్వారమునీసమర్చ్యమహిషా...

ఉ చిత్రవిచిత్రవైఖరులఁ జేకొని భక్తుల నాదరించి
స,ర్వత్ర మహాత్మ్యధీశ్వఫలవైభవకార్యవిశుద్ధు
లిచ్చుసా, విత్రియు నాసరస్వతియుఁ బృథ్వియు
వైష్ణవియున్ భవాని గా, యత్రియునాఁగ నీవె
మహిషా... 82

ఉ. అంబుధిసప్తకంబు బలమై జలముబ్బి జగద్వినాశ
మై,నం బరికించి కంధరమునన్ బ్రియుఁ గైకొని
వారణాసి శూ,లంబుననుద్ధరించి ప్రబలస్థితిశాశ్వ
తవైనశ్రీప్రసూ,నాంబవు నీవు కావె మహిషా...

ఉ. ఏయెడఁ జూచినం గలదె యింకొకప్రాసకమర్థికో
టికిన్, బాయక తల్లివై సకలభాగ్యము లిచ్చిన నీ
వె యీావలెన్, శ్రేయములైన నీవె కులశీలవిశే
షములైననీవె దీ,ర్ఘాయువులైననీవె మహిషా...

క. కొండలపిండుదండిదొరకూఁతురి వై కరివేల్పు

తోడువై, తిండికి మెండుచేదుగల తెల్లని సామికి
గేస్తురాలవై, దండిగ నాలుగైదు మెయిదాలుపు
కోటులసీటుబూవి బ్రహ్మాండము లేలుతల్లి మహి
షా.... 85

ఉ. ఎంచి తలంక మెలంగుచెద లేటిని గొంచక మంచు
కొండపై, డించి తపంబుసల్పెడికడిందివిగావున
నీకు సాము మేక,బంచెడు వేల్పుడెందమనుపా
లకుళంబున నోలలాడురా, యంచవు సుమ్ము నీవు
మహిషా... 86

ఉ. గంగయెడన్ విరాళి యధికంబగునీతని కంచు
నెంచి సర్వాంగములన్ సువర్ణనలినోచితిజూపి
సురల్ తరంగలీ,లం గనుపట్ట గూలికిఁ జలంబో
సరింతువు నీ వగణ్యపు,ణ్యాంగనవౌగదమ్మ మహి
షా... 87

ఉ. ఉల్లమెలర్ప నిన్గొలుచుచుండెడిపుణ్యులపట్ల నె
వ్వరే,ప్రల్లదులై శఠత్వమునఁ బాపపుఁబల్కులు
పల్కుచుండ్రో యా,కల్లరులన్ వధించుటకుఁ గ
న్నెఅసేయకమాన విజ్జగం,బల్లలనాడునట్ల మహి
షా... 88

ఉ. సన్నుతి సేయఁగాఁదరమె చక్కని కాటుకకంటి
చూడ్కి య, త్యున్నతమై కురంగము సముజ్జ్వ

లతం బ్రకటింపుచుండఁగాఁ, బున్నమచందమా
మవలెఁ బొల్చి పయోజములన్ హసించుచునీ,యు
న్నవనెమ్మొగంబు మహిషా... 89

చ. ఘనమగుమీనరూపమునఁ గన్నులుకూర్మతచేఁ
బ్రపాదముల్, తనరుమృగేంద్రవృత్తి నవలగ్న
మునెన్నిన నెన్నునేమొ య,వ్వనజదళాక్షుఁడో
క్కరుఁడు వారల కన్యులకెన్ననౌనె నీ, యనుప
మసౌష్ఠవంబు మహిషా... 90

చ. ప్రకటితవజ్రరేఖగలపాదతలంబునఁ గాసరాసు
రం,గకవికశృంగముల్ నురుముగాఁ దునుమా
డుచుః ద్రొక్కిపట్టివా,యక మృగరాజునెక్కి
కొలువై యలరారెడివిన్నుఁ బూజసే, యక
యుఁకమాన సుమ్ము మహిషా... 91

చ. హలకులిశాంకచిహ్నితము లంచితవర్తులశుద్ధపా
ర్ష్ణికం, బులు ఘనవిద్రుమోపమసముజ్జ్వలగుల్భ
ము లభ్రతారకా,కలితనఖాంకురంబు లభిగణ్య
ములైనభవత్పదంబు లిం, పలర భజింతునమ్మ మ
హిషా... 92

ఉ. దభ్రత యింతలేక సతతంబుభజింతు భవత్పదాబ్జ
ముల్, శుభ్రకళాకలాపపరిశోభితహాస్యముఖా
రవింద యో,విభ్రమహావభావరసవేల్లితసంభ్రమ

శాంభవాత్మ యో, యభ్రసమానవలగ్న మహి
షా... 93

ఉ. ఆతతవేదశాస్త్రమహిమాన్వితులై విలసిల్లుకుం
భభూ, గౌతమముఖ్యు లేర్పఱుపఁగానరు నీవిల
సత్ప్రభావ ము, జ్ఞాతను నేను గాంచఁగలనా
దయచేసి కృతార్థుఁజేయు వి, ఖ్యాతికి నీవసుమ్ము
మహిషా... 94

ఉ. నీమహిమంబు లెన్నుటకు నీరజసంభవుఁడైనఁ
బూనలేఁ, డే మనుజుండ సత్యగుణహీనుఁడ దీ
నుఁడఁ బూననేర్తునే, మామకసాపరాధవిధి మా
న్పుటకెల్లను నీదెభార మో, హైమవతీమదంబ
మహిషా... 95

ఉ. అక్కమలాసనాదులకు నైనఁ బరీక్ష యొనర్పరా
ని నీ, వెక్కడ నీయశోజలధియెక్కడఁ దత్తద
గాధశోధనం, బెక్కడ నాకు నెంచఁబడుటక్క
డ యిట్లు నశక్యసాహసం, బక్కజమౌఁగదమ్మ
మహిషా... 96

చ. హరిహయశాఖిలేఖిని మహాంబుధి కజ్జలపాత్ర
భూతలాం, బరములు సంపుటస్థలులు పంకజసంభ
వమూర్తివక్తలే, ఖరిహరిదశ్వుఁ డట్లయినఁగాని
లిఖింపఁదరంబె నీమనో, హరగుణజాలసంఖ్య మ
హిషా... 97

చ. నిరతము నీకథామృతము నిశ్చలతన్ భజియింపఁ
గంటి నీ, చరణసరోరుహంబులకు సాగిలిమ్రొ
క్కులిడంగఁగంటి నీ, పరమదయారసప్లుతికిఁ బా
త్రుఁడనైతి నిఁకేమిశంక నా, కరయఁ ఫలించెఁ గో
ర్కి మహిషా... 98

చ. నిను వినుతింతునంచు నొకనిక్కపుమిక్కిలిసత్క
విక్రమం,బునఁ బనిపూనినాఁడఁ జలమూని పిపీ
లికకొండఁదాల్పఁబూ,నినగతిగాదె యింతటికి నీ
కృప భక్తులపై సుధారసా,యనమునిజంబునుమ్మ
మహిషా... 99

ఉ. వారిజసంభవాద్యమరవర్గ మనర్గళలీల నీకథల్
ధీరత నాగమార్థఫణితిన్ నిరతంబు గృతుల్ ర
చింపఁగా, నే రచియించునల్పకృతి నీకిది గణ్య
మె యైనఁగాని నీ, కారయ తుల్యబుద్ధి మహి
షా... 100

ఉ. శ్రీరమణీవిశేషగుణచిహ్నితవీవుభవత్కృపాప్తిచే
ధీరుఁడ కశ్యపాన్వయుఁడ దిట్టకవీంద్రుఁడ రామ
చంద్రుఁడన్, గౌరవమొప్ప వృత్తశతకంబురచిం
చితి దీని సన్మణీ, హారముగా గ్రహింపు మహి
షాసురమర్దని పుణ్యవర్ధనీ. 101

మహిషాసురమర్దనిశతకము సంపూర్ణము.

# పీ ఠి క.

సుప్రసిద్ధుఁడు దిట్టకవినారాయణకవి కీశతకకర్త యగురామచంద్రకవి కుమారుఁడు. ఈకవి సమగ్రజీవితము మహిషాసురమర్దనిశతకమునఁ జేర్చియున్నారము గాన నిందు దిఙ్మాత్రముగా నుదాహరించుచున్నారము. ఈ రామచంద్రకవికవిత నిర్దుష్టముగా నిరర్గళధారాశోభితమై మనోహరముగానుండును. ఇతనిగ్రంథము లింతవఱకు మాకీక్రిందనుదాహరించినవి మాత్రము లభించియున్నవి. ఇంకను బ్రయత్నించినచోఁ గొన్నిగ్రంథములు లభింపవచ్చునను నాసగలదు. 1.మహిషాసురమర్దనిశతకము, 2.గొట్టుముక్కలరాజగోపాలశతకము, 8 ఉద్దండరాయశతకము, 4.రఘుతిలకశతకము, 5. వాసిరెడ్డివారిచరిత్రము, 6. హేలావతిదండకము, 7. చాటుపద్యములు.

రామచంద్రకవి చిరకాలము వాసిరెడ్డివారిసంస్థానమునందు వేంకటాద్రినాయఁడువారి కాస్థానకవియై యుభయభాషాపండితుఁ డని పేరుగాంచెను. ఇతనిచాటుపద్యములఁ బట్టిచూడఁ గాలక్రమమున నాకాలమునఁ బేరుపడియున్న వెలమసంస్థానములన్నింటిని జేరి ధనార్థియై రాజాశ్రయముతోఁ గాలముగడిపినటుల ద్యోతకము కాగలదు.

ఉద్దండరాయశతక కర్తయగు దిట్టకవిరామచంద్రకవి యిప్పటికినూరుసంవత్సరములక్రిందట నుండియుండును. ఇంతవఱ కీకవిగ్రంథములుగాని సుప్రసి

ర్థముగునామముగాని యాంధ్రలోకము ఎఱుంగ కుంట పరితాపకరము.

రామచంద్రకవి నూజవీటిప్రభువుల సంస్థానము లోనిదగు మద్దాలి కేఁగి యటఁ గలయుద్దండరాయస్వామినిగూర్చి యీశతకమును రచించెను. శతకమునందు భక్తిరసము ప్రధానస్థానమునొందియున్నది. శతకమంతయు జకారప్రాసముతోనున్న ప్రాసస్థానములలోఁ గవివెదకికొనక క్రొత్తపదములను సందర్భశుద్ధిగా సమకూర్చి తనకవితాప్రాగల్భ్యము వెల్లడించియున్నాఁడు. ఈశతకమునందలి పద్యభావములుగూడ మనోహరభక్తజనహృదయాకర్షణముగానున్నవి. ఈకవి సాహిత్యమందేగాక యద్వైతమతసిద్ధాంతములందుఁ గూడ జితశ్రముఁడని యీశతకమునందలిపద్యములు చెప్పుచున్నవి.

మాకుఁ బూర్వతాళపత్రగ్రంథమును బట్టి వ్రాయఁబడినవ్రాఁతప్రతి జీర్ణమయమైనది లభించినది. ఇంక నువేక్షించిన నీప్రతిగూడ నదృశ్యమగునేమోయని ప్రత్యంతరసహాయములేకున్నను ఎటులో శుద్ధప్రతి నొకవిధముగా సిద్ధపఱచి ముద్రణమునకు నొసంగఁగలిగితిమి. ద్వితీయముద్రణమున శతకమును సర్వవిధముల సంస్కరింపవలెనని యున్నది.

నందిగామ.
5-2-25

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీ ర స్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# ఉద్దండరాయశతకము.



మ. అజకాంతన్ భజియించి భాగవతులం బ్రార్థించి
కెందమ్ముగన్, గజవక్త్రుం బ్రణుతించి తొంటిక
వులం గైవారముల్ సేసి ప్రేమ జూపా
ర్జోహ పటించు సాగి యొనన్ మద్దాలి యుద్దం
డరాయ! జయ శ్రీసునిధేయ! భక్తజనగేయా!
నిత్యభాగ్యోదయా. 1

మ. త్రిజగత్పూజ్యము లైనసీపదము లర్థిన్ సేవ
గావింతు నిన్, భజియింతున్ విరతంబు మ్రొ
క్కుదు మదిన్ భావించి కీర్తింతు సామజసంగ
శుక నిశ్శ్రేయకారక హరీ మద్దాలి... 2

మ. భుజముల్ ఫాల మురంబు చేతులు పదంబుల్
భూమి మోపంగ సాగి జలూకాగతిచేఁ
బ్రణామశతముల్ గిలింతు గైకొమ్ము ప్రేమ
జెలంగన్ భవదీయదాసుఁడఁ జుమీ మద్దాలి...

మ. ప్రజకాంతాహ్వయమేశ సన్మునిజనప్రాణాత్మసం
వేశ నీరజరాజధ్వజపోషితేంద్రజనిరూఢప్రా
భవోపేత ధర్మజరాజ్యప్రతిపాలనాత్మయుత
శ్రీమద్దాలి... 4

మ. సజలాంభోధరతుల్యనైల్యకలనాచంచత్తనూ
ధామా శౌర్యజితాసురవ్యవరోధిస్తోమ విధిము
ఖ్యాదిత్యనక్షత్రసోమ జటివ్రాతస్తుతైకనామ
వహానూం మద్దాలి .. 5

మ. భజనీయైకమహావిరంబర పదాంభస్సిక్తహే
మాద్రి ధన్విజటాడంబర కాంచనాంబర సదావి
శ్వంభరా గోపనా, మజయానాహ్వయనూబ్జబం
భర నమో మద్దాలి... 6

మ. అజగవ్యర్చిత మానిచర్చిత సమస్తాదిత్యసంప్రా
ర్థితా, సుజనారాధిత తత్త్వబోధిత సుమునీ
స్తుత్యశోభా పులో, మజివశ్యప్రభ యుగ్రసేన
సులభా మద్దాలి... 7

మ. ద్విజరాజాంబుజమిత్రనేత్ర సకలాధిష్ఠానహ్మా
త్మాపత్ర వారిజసంభూతనిజాగ్రపుత్ర కరుణా
బృందిష్ఠచారిత్ర వ్యోమజటాజూట సదాత్మ
మిత్ర నృహరీ మద్దాలి... 8

మ. రజనీవల్లభభానునేత్ర త్రిజగద్రాషిష్ఠిచారిత్ర

ర,రజగేహైకకళత్ర భవ్యగుణపాత్రా నన్ని
కన్ నీచక, ర్మజడత్వంబులుఁ బాపి ప్రోవఁగదె శ్రీ
మద్దాలి... 9

మ. ద్విజరాజధ్వజ దివ్యవందిత సదా వేదీప్యమానా
త్మ దేవ జగన్నాథ ముకుంద మాధవ హరీ
వందారుమందార నమ్మఁజనున్ నిన్ను దయామ
యాత్ముఁడవయా మద్దాలి... 10

మ. గజరాట్ప్రముఖ నాకుఁగన్పడవె వేగన్గాంచు నీపా
దపంకజముల్ నీవదనారవిందమును నీక
న్దమ్ములుం గామపో, మజయంతాదుల గేరుచ
క్కదనముల్ మద్దాలి... 11

మ. రజతక్ష్మాధరగేహసాయక భవద్రాజత్ప్రభా
వంబు ల,క్కజముల్ ద్రౌపదియార్తిచే సరసి
జాక్షా యన్నమాత్రానఁ ప్రేమజిగుల్లొత్తఁగ
మానము న్నిలిపితౌ మద్దాలి... 12

మ. అజహత్ప్రాభవ తెల్పవే స్మృతి యవిద్యారూ
పపుంనువా, లుజోరం దృష్టికి నంతరంబిడదు
తల్లోపంబు లేకున్న భీ, మజరాయుఃగ్రథనంబుజీవు
నకగున్ మద్దాలి... 13

మ. విజయక్షేమదనీదయంగద జయావిర్భాతిసంసా
రప, క్షజపంకాంబుధు లింకిపోవుటకు నీసంసేవ

పేరెంటి శ్రీ,ష్ణజగత్ప్రాణము కారణంబుగద
శ్రీమద్దాలి... 14

మ. వ్రజముం దాసస ముజ్జగించి సినుం జీరం
దారిగల్పింపవే, రుజకాధారము పూతిగంధల
హారియూథంబు జంత్రంపుబో, మ్మి మీ దేహ
ము దీనినమ్మందగునే మద్దాలి... 15

మ అజరుద్రాదులు నిన్నుంగొల్తురమరుల్ ప్రార్థిం
తురే ప్రొద్దు నెల్లజగంబుల్ సృజియించుకర్తవు
దయాలంకారచిత్తుండవాత్మజతుల్యంబుగనన్ను
బ్రోవుము కృపన్ మద్దాలి... 16

మ. వృజినంబుల్ హరియించి నన్నెపుడు సంప్రాప్తా
త్మున్ గావించి నిన్, భజియింపన్ మతిబుట్టంజేసి
కృపచేం బాలింపవే చందమామ జిగిం జేకొని
కల్వమొగ్గవలె శ్రీమద్దాలి... 17

మ. త్యజియింతున్ భవబంధముల్ మనములో
నర్చింతు నీపాదముల్, విజయంబందుదు మోక్ష
లక్ష్మీవలనన్ వేమారు సంగ్రామకర్మ జరాసంధ
మదాపహారి నృహరీ మద్దాలి... 18

మ. గజఘోటీ ముఖసంపదల్ సతములా కా వీశరీ
రంబులే, నిజముల్ వ్యర్థములంచు రోసి మును
మున్నే యోహికాగమ్యకా, మ్యజిగీషన్ భజి
యించి కాంచవలె నిన్ మద్దాలి... 19

మ. సృజియింపన్ సృజియించి మేలొసఁగ నిర్జింపం
బ్రజామానసాం,బుజవాంఛల్ సఫలం బొనర్ప
విఫలంబుంజేయనీవేని కా,మజగద్భాగకమూల
కర్తవు భళీ మద్దాలి... 20

మ. సుజనత్వంబరిదేహిమత్తుఁడయి సంక్షోభింపఁగా
నేఁ ని,త్యజుగుప్సాస్పదమూఁజవంజవసుఖం బా
హాభవద్దివ్యనా, మజపం బేమర కాత్మనిల్పవలె
శ్రీమద్దాలి... 21

మ. యజనామ్నాయతపోజపవ్రతము లత్యంతంబు
వర్ధిల్లఁజూ,ప్రజ కానందనుమందమై పరగి సంప
న్నాగరిజాతంపుఁగో,మ్మగుర్పంగరుణించుకర్తవు
గదా మద్దాలి.... 22

మ గజ మేదేశికునొద్ద శిక్షఁగనె సాకల్యంబుగాఁ
గుబ్జ మే, ద్విజు నాచార్యునిగాఁగఁజేకొనె భవ
ద్దివ్యామృతప్రాయ నా,మజపప్రాప్తికి సాత్వికంబె
గురువౌ మద్దాలి... 23

మ. అజనుఃశ్లాఘ్యసుఖంబు గైకొనెడ భూయఃస్వా
యదానందనం, దజనీసత్వగుణస్ఫురత్స్ఫటికర
త్నంబందు మతుల్యార్వాక, ర్మజపారోచులలోఁ
గొనంగదవె శ్రీమద్దాలి... 24

మ. ధ్వజమై వాహనమై పతంగపతిగొల్వన్ బిల్వ

రాసెజ్జయందు జరిపుట్టముగట్టి కౌలొవ్వసఁగి
తోడ్తో చెంగటం గల్మికొ,మ్మ జతైనిల్వ జగం
బులేలుదుప్ర శ్రీమద్దాలి... 25

మ. యజమానత్వముసంగి జ్ఞానశిఖయం దత్యంతమ
త్కల్పిపం, బజరూపంబుగ వేల్వఁ జేయవె
త్వదీయాంఘ్రిద్వయీభక్తిసో, మజలంబాని పవి
త్రమూర్తినగుదుఁ మద్దాలి... 26

మ. స్వజనచ్ఛత్రముఖోపచారకలన వ్యాపారులై
భక్తివి,శ్వజనుల్ గొల్తురు సిఁసహోందిరు
సురల్ స్వర్గంబునందుఁ బులో,మజతో సింద్రు
నివోలె నుర్వరపయిఁ మద్దాలి... 27

మ. ఇజగుంజెంది కుచేలుఁ డర్థియయి నిన్నీతుంప నే
తేరఁ ద,ద్ద్విజవర్యుఁ ఫలితార్థుజేసితివి నిఁదే
హీయనఁ నీశుభా,త్మజతుప్రాయముగాఁ గడం
గుటరుదే మద్దాలి... 28

మ. నిజమాయఁ విధి వేగిలంపఁ గలఁడే యింద్రా
త్మతఁ నీవు వే,సృజనల్ చేసితి వెల్లవత్సముల
నిఁ శీలింపఁగా లేక బ్ర,హ్మ జితప్రాభవుఁడయ్యె
మత్తుఁడగుఁ మద్దాలి... 29

మ. అజమిళుం డొకవిప్రదాసియెడ రత్యాసక్తుఁ
డై కాలమెం,తజనంగాఁ దుది మోక్షమిచ్చితివి

యోనారాయణాయంచు నాత్మజునిం జీరినదాన
బ్రీతమతివైౖ మద్దాలి... 30

మ. విజనంబైనమహాటవిన్ శబరి యావిర్భూతస
ద్భక్తిచే, గొరియింపన్ ఫలమీయ దానికిడవే
పుణ్యంబు శ్రీరామనా, మజనాధీశ్వరరూపధే
యమున మున్ మద్దాలి... 31

మ. నిజదాసానసాభిమానుఁడవయా నీ వాజిలో
సోమద, త్రిజకేలూంచిచి సాత్యకిన్ మనిపె తత్సాం
తంబు సోలింపు సా, మ్మజనింపంబడియున్న వేళ
కృపచే మద్దాలి... 32

మ. భుజదర్పంబున ద్రోణిసుప్తవధకై బూనంగ
నీవెన్నిభూ, భుజులట్టుండఁ దొలంగఁదెచ్చితివి
నిన్ బూజించువారౌట ధర్మజభీమార్జున మద్ర
సూనులఁ బ్రోవన్ మద్దాలి... 33

మ బుజూతత్త్వం బరినిన్ వాంఛించిఖలు నాభృత్యాత్ము
గాఁ గూల్చువో, రజకుం దూడుట మల్లులీల్గుట
మదారంభంబుచే దానిసాంద జముం ద్రుంగుట
కంసమూలముగదా మద్దాలి... 34

మ. కుజనుల్ నిన్నుభజింపలేక తమకోర్కుల్ వేరు
గా గేరికే, రిజపుంబల్కులు బల్కుచుం జెడుదు
రున్వన్ నారకావాసమ,ప్రజలూకాహృతదేహుఁ
డై పరమునన్ మద్దాలి... 35

మ. రజతస్వర్ణముఖాఖిలార్థకృతగర్వగ్రస్తులై మత్తులై, భోజుంగుల్ నిన్ భజియింపలేక తనువుల్ బోవన్ దమం బాత్మఁ గ్రమ్మ జముం జేరుదు రెన్నిజన్మములకున్ మద్దాలి... 36

మ. అజరాధీశ్వరుఁ డైననీకు పరిచర్యల్ సేయఁ బ్రాల్మాలినన్, విజుగౌబ్బెన్ దుమిమ్ముట్టుఁ డజ్ఞానపుఁ దుర్జ్ఞానహీనంపురి, మ్మజెదన్ నిన్ భజియింతు రాపధమికన్ మద్దాలి... 37

మ. అజనాపోషకమండలుల్ గని ధర్మాయత్తులై గౌతమీ,త్రిజగత్కారముఖాఖిలర్షులు నినున్ బ్రేక్షింపఁగాలేరు ధర్మఘూంసుల్ దరిముట్టుటట్టులా యిఁకన్ మద్దాలి... 38

మ. కుజముల్ రాజసతామసంబులు త్వదంఘ్రిల్ గూర్చు మన్మానసాం,బుజమేటోలు; పునర్భవైల బిలతుగ్గోతుంబు తాప్రకృతియు,గ్మజయత్వంబు వహించి సల్పుఁగదె శ్రీమద్దాలి... 39

మ. గుజాగుంట్లుం గడతేర్పలేని వెకకోర్కుల్ గోగుటల్ వట్టిభే,షజముల్ పీటనశింప దజ్ఞత భవత్సంసేవసిద్ధింపుజా, ల్మజనశ్రేణికతత్ జ్ఞతామ యమరున్ మద్దాలి... 40

మ. అజరస్థాపితకల్పకంబవయి సుయాత్ర్యాలింపవే యో

యాధో,త్తుజ విన్నెనెదనమ్మినాఁడ నీకమత్యాలు
ష్యముల్ బాఱఁజి,మ్మ జుగుప్సల్ బెడబాప
కర్తవు జుమీ మద్దాలి... 41

మ. గజవక్త్రుండు భుజంగమాధిపతి గంగాద్విపినీభ
ర్తనీ,రజసంజాతుఁడు భారతీసతియు నీప్రాంచ
త్పఫల్ బ్రేమ సా, మజటాగానముల౯ భజింతు
రెపుడు౯ మద్దాలి... 42

మ. యజురాదిశ్రుతులెల్ల ని౯ బొగడు నాహాయంత్రు
నీకీర్తి కన్యజుడు౯ భారతి నీదుతారకము
జిహ్వాగ్రంబుల౯ మేనకాత్మజయు౯ శంభుఁడు
దాల్చి పొంగుదురు శ్రీమద్దాలి.... 43

మ. విజితత్వంబున నొంద దీషణదవాగ్నిర్భాతి
యోమహాచతు, ర్భుజ తచ్ఛాంతికి తాపకీవకరు
ణాపూరంపుఁబాలేటిచె, మ్మజుమీ నమ్మినవాక్షి
కాంబుద ఋఁక౯ మద్దాలి... 44

మ. గిజిగాడెట్టులొ యట్లజీవుఁడును దద్దేహంబె దే
హంబుతొ,ద్విజ మాలోపల జ్యోతినుంచుకొని
యుద్దీపించునట్లె యజ,హ్మాజగజ్జ్యోతినినిన్నుఁగాం
చనలెలో మద్దాలి... 45

మ. గజగండస్థలివాలె నెమ్మన మశక్యంబైన దుర్వాం
ఛవే,గిజిలందూ లెడుదీని మాన్పభవదంఘ్రిస్వర్ధ్రు

మూలైకసీ, మజవాళ్కృష్టికి నందనీయఁగదె శ్రీ
మద్దాలి.... 46

మ. గజపుష్పాంచితదివ్యదామములతోఁ గల్యాణచే
లంబుతో, భుజకీర్తుల్ మొదలైనసొమ్ముగమితోఁ
బోల్పారునీలంపుబో, మ్మజిగిఁ గన్పడవయ్య మొ
క్కులిడెదన్ మద్దాలి... 47

మ. స్వజనుంగా గరుణించి నీస్మృతుల కస్మన్నాథచే
తఃపశు, వ్రజముంజేసి యొసంగవే యిపుడు
ప్రత్యక్షంబు తాపత్రయో, ష్మ జెడన్ త్వత్పదదర్శ
నాప్తి మనెదన్ మద్దాలి... 48

మ. అజపుత్రాదిమునుల్ భవన్మహిము మేకాంతం
బుగాఁ గాన నో, టజముల్ జేరి జపించి కానరతి
దాప్త్యప్రక్రియాలబ్ధపా, ప్మజడీభూతుఁడ నేను
గాంచఁగలనా? మద్దాలి... 49

మ. అజరద్వీపినిగన్న పాదకమలం బాసించితిన్ జూప
వే, రజనీనాయక సోదరీరమణ యోరాజీవపత్రా
క్ష న, మ్మజుమీ దృశ్యము నశ్య మైహికమునన్
మద్దాలి... 50

మ. అజకంఠస్తనమై పరోపకృతిసేయన్ లేని మద్దేహ
య, ష్టిజనింపన్ ఫలమేమి దీనిని గవిన్ సేవింపఁ
గైకొమ్ము జన్మజుగుప్సం బెడబాసిసార్థకముగన్
మద్దాలి... 51

మ. రజనింజోలె యవిద్య నెమ్మదికి నిద్రంగూర్చు
విద్యాసమృద్ధి జగచ్ఛశుఁడపోలె తెల్వినిడుఁ
దివ్యజ్ఞానహైన్యత్రియా, మజనంజేయవె తెల్విఁ
గైకొనియెదన్ మద్దాలి.... 52

మ. విజితృత్వము నద్దురాప్తిభవ ముద్వీతంబుగా
నూతనాం, బుజసౌందర్యము లైనసీదుపదముల్
బూజింతుఁ గారుణ్యభూ, మిజలాసారము నాప
యిన్ గురియవే మద్దాలి... 53

మ. అజ నీదర్శనముఁ జ్బటప్పుడో యనేహాస్రోతమం
తంశడొం,కి జరంగెన్ గనుపట్టు నిప్పుడయినన్
గీర్తించి మైనిండభ: ర్మజలం బుబ్బి ప్రవింప మ్రొ
క్కులిడెదన్ మద్దాలి... 54

మ. సుజనుంగాఁ గరుణించి నామదికి సంశుద్ధిం బ్ర
సాదింపి లో, కజనన్యాశ్రయవత్సవత్సశకటా
కారాసురద్వాదశా, త్మజరక్షింపవె మోక్షదాత
వయి శ్రీమద్దాలి... 55

మ. ప్రజిహావల్లికి సాంథుఁ దోరసిలు శేవన్ గర్వికిన్
సీపుగా,వు జగత్పూర్ణుఁడవయ్యు సాధుగుణభ
ప్యం బ్రోతు వజ్ఞానధూ, మజగర్వాంధుఁడ నెట్లు
బ్రోచెదవో నన్ మద్దాలి... 56

మ. అజశృంగీకితవార్కమ ముష్టిఫలవాంఛాయోగ్య

సంసారమహాధ్వజదుర్వాంఛలుమాన్పి యొ
క్కయెడ వేడ్కంబోలె నీదిన్యనామజపం
బూనగ బుద్ధినియ్యగదె శ్రీమద్దాలి... 57

మ. గుజుగుంట్లెంతయుదీర్ఘకైహికపుసంకోచంబు చేతం
గజీబిజిగా చింతలె పుట్టసాగనిఁకనిఁ బెర్కొం
టకె ట్లిట్టిచ్ఛ, ద్మజుగుప్సం బెడబాపి సాగఁగదె
శ్రీమద్దాలి.... 58

మ. గజబంధి న్యుపమానమై యిహా నసౌఖ్యప్రాప్తి
నొందింప సాగె జుగుప్సంబడఁజాల నింకభవదం
ఘ్రిద్వంద్వసేవానికా, మజగన్మోహనబుద్ధి నాకొ
సఁగవే శ్రీమద్దాలి... 59

మ. భుజమధ్యంబున లచ్చి పార్శ్వయుగళిఁ భూ
మిాళ లుప్పొంగ భక్తజనుల్ గొల్వఁగ నోల
గంబమరునిఁ గన్గొందుఁ గన్నార ఘోరజటా
జూటనుతాత్మ కన్పడఁగదే మద్దాలి... 60

మ. గజమెట్లట్లు నేను కర్మఫలనక్రగ్రస్తతఁబొం
ది యా, ధిజబాధంబడియున్న వాఁడఁ గరుణాధీ
నుండవై భావిజన్మజుగుప్సాతరస్థుఁ బాపఁగదె
శ్రీమద్దాలి... 61

మ. మృజమున్మున్న గశుద్ధిదేలిచెద సామిా యోమిఁ
కఁ నీమహా, భజనాగాంగఝురీరసంబొసఁగవే

బల్మాఱునుత్కృల్మషా, త్మజపత్ శాళనమాచరించు
టకునై మద్దాలి... 62

మ. భజమానత్వదుపాస్తిమగ్నమతినై భాసిలినట్లుఁ
స , జనత్వం బొనఁగూర్పవయ్య సుమనోబం
హిష్ఠ సద్భక్తిన, ర్మజద్ధైర్యంబున ధిక్కరించెద
యముఁ మద్దాలి... 63

మ. విశాలసమున గాఁగఁ బంచరాయు నిర్వ్యథాప్తి
గా జీవనంబు జగద్వందితయుష్మదంఘ్రిభజనా
పూర్ణంబుగా నిర్మలా, త్మజటివ్రాతనుతాత్మ నా
కొసఁగవే మద్దాలి .. 64

మ. గిరిగిట్లాడెడిదీనతఁ బరులకై కేల్మాచుటకాని
నీకు జత్తై మ్రొక్కుదు నీనికిత్తిరిపెపుంగోరాట
ముఁ పేరి పా, మజిలాయించుటమాన్పు మ్రొ
క్కులిడెదఁ మద్దాలి... 65

మ. విలసత్ క్షీరరసానుభూతివలె నీవిఖ్యాతివర్ణింప
నిం, పుజెలంగఁ దయచేసి నిల్పఁగదె నాబుద్ధిం
జిదానందధా,మ జగత్సన్నుతనామ శాశ్వత
తమా మద్దాలి... 66

మ. భజనాభావుఁడనౌట నతీగతుగా భావింతువే
మోసమ, స్తజగత్కృత్రప నీకు ద్వేషిగలఁడాసర్వం
బు నీసృష్టియా,త్మజుఁగాఁగై కొనకున్న దిక్కుగల
దా మద్దాలి... 67

మ. కుజనాఖ్యాకుఁడ నేను నీవు సదనుక్రోశప్రభావుం
డ వింక జడత్వం బెడలించి నాకునిధివై కన్పట్టి
ప్రాకృష్టక, ర్మజనుంగా గరుణింపకున్నఁగలదా
మద్దాలి... 68

మ. అజఘన్యత్వదుపాస్తినాకొసఁగవేయాత్మేశ భూవ
హ్నివా, యు జలాకాశగుణాన్వితంబయిన యీ
యుచ్ఛిష్టదేహంబుక, ర్మజమే నిత్యము భక్తిని
త్యధనమే మద్దాలి... 69

మ. నిజమొప్పారఁగ నాదుకందొవకు నానెయ్యంబు
పేరింటనొ, ప్పుజకోరంబునకుఁ మదీయహృదయం
భోరాశికిఁ జందమా, మజమీ నీపదపద్మ దర్శ
నమిఁకఁ మద్దాలి... 70

మ. భజనీయాత్మక నావిశుద్ధి వివరింపం బుద్ధి స
న్నాసిరీ, తిజుమీ నిన్ను నెఱుంగఁదోఁచునెడఁ
గీర్తింతుఁ .సదా వేదుజా, ల్మజనుండఁ ద్వాప
నుజ్ఞయెట్టులో యిఁకఁ మద్దాలి... 71

మ. వ్రజముల్ గూడుక గోపగోపికల నిర్వ్యాజైక
భక్తిఁ బలా, నుజ నీసేవలొనర్చు భాగ్యమున
కెన్నోనోఁచిరో జన్మజ, న్మజఘన్యత్వము బాసి
భాసిలుటకై మద్దాలి... 72

మ. కుజరూపంబుల నేమినోచెనొకొ నీకుం గానలోను

న్న యా, భుజపత్త్రద్రువు లాఁకసాలతరు లావున్నా
గముల్ వీచియు, మ్మజనం జల్లని సేవ సేయుట
టనునై మద్దాలి... 73

మ. ప్రజలెట్లట్లుగ నీవు గోపికలు బెంపన్ సొంపు
గై కొంటకే, భజనల్ జేసినపుణ్యమో గృహావనీ
ప్రాంచజ్జపాకుంద పో, మజయాజాతిలవంగలుం
గములనున్ మద్దాలి... 74

మ. ప్రజడింభచ్ఛటఁగూడి నీవనవిత్రోవంబోవుచో
దర్భగు, ల్భజముల్ నీపదపద్మముల్ తమపయిం
బర్వం బవిత్రస్వనా, మజగత్స్వార్థములౌట కేసు
కృతమో మద్దాలి... 75

మ. గజనిమ్మల్ సురపొన్నలుం బనసలుం గన్నేరు
లున్ మున్నుగాఁ, గుజముల్ గాన; నవల్లవీక
భవనంఘ్రుల్ దోహదాచారథ, ర్మజసంభావనఁ
గాంచనోచుట హాహా మద్దాలి... 76

మ. రజనీచారుఁడు సీతఁ గొంచు జన తద్రక్షఃపతిన్
దాఁకి వీఁక జటాయుఃఖగమిూన్లై నీకొలనుఁ
దత్కాయంబు సంగ్రామక, ర్మజితంబౌటకు నెంత
పుణ్యఫలమో మద్దాలి... 77

మ. నిజవిత్తంబులు సార్థకంబులుగ నిన్ సేవించి
యర్పించి యిం, పుజనింపన్ జరియించుపుణ్యు

లకుఁ దత్పుణ్యంబు నీరెత్తుని, మ్మజిగుళ్లోత్రిఫలిం
చునట్టులుగదా మద్దాలి... 78

మ. వ్రజముఖ్యుం డొకఁ డేకతంబ తనకుఁ వాలా
యమై నెమ్మనం, బు జెలంగం బొలిగద్దనెక్కిన
దొంగా బోసేతురమ్మన్న యా,మజతై రాభుజి ఖుం
పవత్తునఁట శ్రీమద్దాలి... 79

మ. భజనాభావమతిఁ మదాంధులయి సంపన్మోహ
బుద్ధిం గిజా,గిజ నెన్నాళ్లుకు దన్నుకున్నఁగలదే
క్షేమంబు సంసారవి,ర్మజనశ్రేణుల కూర్ధ్వసిద్ధి
వలనఁ మద్దాలి... 80

మ. అజరాస్థానపలాసినీ రతిసుఖవ్యాపారనష్టక్తని,
శ్వాజిదాదుల్ భవదంఘ్రిభక్తిరలె మోక్షశ్రీద
ముల్ గావు నో,మజనుఁ నీపదసేవ సువ్రత
ముగా మద్దాలి... 81

మ. యజనంబుల్ పదివేలు చేసిన యనిశ్చైత్యం ద్రాశ్ర
యంబింతెకా,ని జనిఁ మాన్పెడులోకమబ్బదు
తదుష్నేషంబు నిఁ గొల్వబే,మఁ జిగుర్కొన్న
యనంతరంబునఁగదా మద్దాలి... 82

మ. ద్విజుఁడై వం బ్లవుఁడైనఁగాని నినుగీర్తింపం బ్రవు
ణ్యాత్ముఁడౌ, కుజనత్వంబున మత్తుఁడై సిరులు పె
క్కుల్ గల్గి కౌసుంభరో,మజముల్ గట్టినపుణ్య
మూర్తియగునే మద్దాలి... 88

మ. ఖజకాకాండమెఱుంగునే మృదులశాకస్థాయియై
యుండి వేళ్ళజతిక్తాదిరుచుల్ సుపూాయమున కేలా
కల్గు సద్బుద్ధిసౌ, మ్యజనుశ్రేణులపొందునంత
మనినక్ మద్దాలి... 84

మ భుజియింపక్ నవనీతమై యమృతమై పూదే
న్నయై నారికేళజలంబై సుక్షమై రుచించు
మృదుహారంబైన నీరామనామజపం బెంతటి
యోగ్యభోగ్యఫలమో మద్దాలి... 85

మ. ఋజుబుద్ధిక్ నినుసంస్మరింపఁగలుగుక్ శ్రీశైలకాశీ
నివాస జగన్నాథ గయాప్రయాగసువిశేషం
బుల్ మహాదానధర్మజపాధ్వర్య తపోవ్రతైక
ఫలముల్ మద్దాలి... 86

మ. త్రిజగద్భర్తయశేష సేవ్యుఁడు మనోధిష్ఠుండగ
ణార్థదాయి జితక్రోధుఁడు నీవలెం గలుగునే
యింకొక్కనాథుండు కర్మజకాలుష్యముబాయ
నిన్నెగొలుతుక్ మద్దాలి... 87

మ. అజునిం బొక్కిటగన్న వేలుపవు నీయం దాపదు
ద్ధారకా, ఖ్యజగద్ధేయముగాఁ బ్రసిద్ధుఁగు నీకన్నం
గృపాశాలి బ్రేమజెలంగం భరియించుటెట్లు
గుసు శ్రీమద్దాలి... 88

మ. అజహాద్దంభవిజృంభమాణవిపులాజాండంబుదీపై

కరూ,పజతేజంబున వెల్గఁజేసెదు భవద్ధ్యానంబు
వర్ణింపఁ బ,ద్మజుఁడైనఁ భవుఁడైన నోపఁగ
లఁడా మద్దాలి... 89

మ.భజనీయైకనిగాఢహుంకృతులు సంభావించి వం
దారువా,గ్మిజనశ్రేణికి విద్యలిత్తువు హయగ్రీవా
కృతిఁ నీవు సా, మజచర్మాంబరపూజితాంఘ్రి
యుగళా మద్దాలి... 90

మ. విజయుఁ భీమునివెంటదోడ్కొని రణోర్విఁ
భీముచేతఁ గిరి,వ్రజనాథుం బొలియించి చేసితి
వి నిరాఘ్యరాజ్యార్థసంసిద్ధి ధ,ర్మజునింగూర్చిటు యు
క్త్యమాణునిగ శ్రీమద్దాలి... 91

మ అజరద్ధ్యానసుఖోదయాప్తి తనసామ్మైనప్పుడే ని
న్నుపం, చజనుండెంచవలెఁ దదారభటి హ్రస్వం
బైన యుద్ధామభీ, మజరాభారము తోఁచనీయ
దు సుమీ మద్దాలి... 92

మ. త్రిజగంబుల్ భరియించి ప్రోతు వెపుడుఁ
దేవావళుల్ మెచ్చ నం, డజనుఃకూర్మ వరాహ
సింహ వటుగా ట్సంతానజిద్రామ రా, మజిన
శ్రీకలికిస్వరూపములచే మద్దాలి... 93

మ. త్యజియింతుఁ జనినీకృపారసముచేతఁ భీతతం
ఖాసి దీ, నజనాధారక నిఁ భజించునెడలఁ

నాబుద్ధికిఁ యాతయా, మఱవందత్త్వము నొం
దనియ్యకుము శ్రీమద్దాలి... 94

మ. ధ్వజినీసంగ్రహ మెంత యున్న బహువిత్తంబు
న్న దివ్యాశుగ, వ్రజమున్నఁ దనవెంటరాదు య
మునోర్వఁ రాదు నీదిక్ష్యనా, మఱపం బిచ్చినదా
న సర్వసుఖమే మద్దాలి... 95

మ. భుజగాధీశశయాన యానవిజితాంభోజాత శ్రీ
మద్గదా, గ్రజ మన్నామకతర్ణకంబులర నీకారు
ణ్యపుంబాల గుమ్మజడిం దేల్పవె కామధేనువువ
లెఁ మద్దాలి... 96

మ. ఇఱుగుంగూర్చి శరీరయాత్రకయి భూభృత్తీర
ముల్ జేరి చాల జుగుప్సంబడి యుష్మదీయచర
ణాలానంబునం జిత్తసా, మజ మిన్నాళ్లకు నేఁడు
కట్టుబడె శ్రీమద్దాలి... 97

మ. ప్రజనశ్రీ వహియించె మత్సుకృతసంపత్కామ
ధేనూత్తమం, బు జనింపంబడు నీకృపార్భకము
తన్మూలైకనిర్వాణథా, మజసౌఖ్యామృతసిద్ధి నా
కుఁగొదువా మద్దాలి... 98

మ. రజముంబోలె విధూతమై యఘముబాఱఁ
సన్మనుండై జనుండు జరాత్వం బరుదెంచి జీర్ణ

మతి తోడ్తోరాక మున్నె ప్రణామ్మజపస్తోత్రము
లం భజింపవలె నిఁక మద్దాలి... 99

మ. ఁజరాల్ దీరిచి పేరుగూర్చుగతికై వాంఛంపుపద్యం
బుల, క్కజమొప్పన్ సృజియింపనయ్యె నివిగోఁ
గైకొమ్ము కారుణ్యధా, మ జూహారుల్ పచరించు
వేలకొలఁదుల్ మద్దాలి... 100

మ. ప్రజన్మై యొప్ప వహింపు మత్కవిత యోసర్వేశ
యోదైవతా, ల్లజ సంభావన సేతు నీపదము లీలా
భక్తిపేరింటికిమ్మా, జవాదిం దులకించుపాద్య
విధిచే మద్దాలి... 101

మ. ద్విజరాడ్వాహన నేను దిట్టకవిసూతిన్ గశ్యప
క్షింద్రగో, త్రజుఁడన్ నామము రామచంద్రుఁడు
భవద్దాసుండ నాయందుఁబ్రే, మ జిగుర్పన్ శతకం
బు గైకొనుము శ్రీమద్దాలి యుద్దండరా, య!
జయ శ్రీసువిధేయ! భక్తజనగేయా! నిత్య
భాగ్యోదయా!. 102

ఉద్దండరాయశతకము సంపూర్ణము.



శ్రీ రస్తు.

దిట్టకవి రామచంద్రకవికృత

# గొట్టుముక్కల

# రాజగోపాలశతకము.



శా. శ్రీభద్రస్థితు లాశ్రితావళుల కత్యుగ్రానుకంపన్
సదా,లాభప్రాప్తులుగా నొనర్చు నజులీలామో
హానాకారమూ,యూంభీగున్ నినుగూర్చి మ్రొ
క్కుడు నవల్పాకల్పతల్పాయిత, క్ష్మాభృత్ప్రసన్నగ
గొట్టుముక్కలపురాంకా రాజగోపాలకా. 1

శా. హేలాసమ్మిళితత్రిమూర్తిరుచియా హేరం
బుఁ బ్రార్థించుచున్, గాళిదాసమయూరమాఘ
ముఖులం గైవారముల్ చేసి నిన్, వాలాయం
బుగఁ బూజసేతుఁ గచనవ్యాపారవిస్తారవా,గ్జా
లాబ్జంబుల గొట్టుముక్కలపురాంకా రాజగోపా
లకా. 2

శా. చక్రీ చక్రిశయాన; యానజితాంచత్స్వర్ణతా
రాపతీ, నక్రగ్రస్తగజేంద్రరక్షణమతీ! నానాప్ర

పంచాకృతీ, శక్రాశ్మద్యుతిసాగరైకవసతీ సన్మౌని
హృత్పుండరీ, కక్రీడాగతి గొట్టు... 3

శా. అకలంకాశ్రితసౌఖ్యదాయక సమస్తాబ్జాండభాం
డాధినా,యక! యంభోజదళాయతాంబక!విమూ
ఢావేశ్యమాయావిడం, బక! సాధువ్రజతాపకృ
త్పృబలదృప్యద్దైత్యకాండైకత, క్షక సద్రక్షక
గొట్టు... 4

మ. వరనాభీజనితాదిశిల్పక!ప్రభావప్రాభవానల్పకా!
తరితానంతమనోవికల్పక ! యశోదానందకృత్క
ల్పకా, స్థిరసంకల్పక! వేదజల్పక! మహాశేషాహి
రాట్తల్పకా, కరుణాకల్పక గొట్టు... 5

మ.పరమాభీరక! భవ్యభారక! మహాబ్రహ్మాండభాండ
స్థలో, దరవిస్తారక! విశ్వకారక! యశోదాదా
రకా! వేషభూ, ధరసంచారక! సద్విచారక!
సముద్యద్భక్తమందారకా,కరుణాధారక గొ...

మ. అజరుద్రాదులు నిన్నెఱుంగుటకు నింతైనన్
సమర్థింపలేరు జగత్పూర్ణుఁడ వన్నిరూపములు
నీరూపంబులై యుండు నిన్, భజనం బ్రీణితు
సేయ నావశమె నాభాగ్యంబు నీచిత్త మో,
గజరాడ్రక్షక గొట్టు... 7

మ. అసమప్రౌఢి సితాసితద్యుతుల నెయ్యంబారగా

రామకృష్ణసమాఖ్యాయుతులై జనించి యదువం
శ సాధ్వములో మిమ్ముఁ బద్యసమృద్ధిఁ భజియింతు
దంభహారిరూపారంభ! సంపుష్టరాష్ట్రసనాథార్భక
గోట్టు... 8

మ. సురలానందము నొంద నందునకుఁ జతుఃప్రీతి
గాఁ; గోపమంధిరశ్రీమఁ బసికందువై వెలయు
మీరాదివ్యామృతాకారవి, స్ఫురణఁ గన్గొన
నేమినోఁచిరో మహాశూద్రీమణుల్ చింతలే,
క రమానాయక గోట్టు... 9

శా. సారోద్ధారపునూనెలంటి, పునుగుం జవ్వాది
మైనూన్చిపస్నీ రాపై జలకంబొనర్చి కృపనెంతో
గోపికల్ మిమ్ముఁ గన్నారం గాంచుట కెంతభా
గ్యమొకో నందాభీరమాయానరాకారభ్రామిక
గోట్టు... 10

మ. అమరఁ మిమ్మొకపుత్త్రమాత్రులని నెయ్యంబార
నూహించి చిత్రముగాఁ బుత్త్రమహోత్సవం
బులు యశోదానందు లానందభావముతోఁ
జేయుట జన్మజన్మకృత సేవానిష్ఠులౌటంగదా, కమ
లాకాముక గోట్టు... 11

మ. జగదీశానులు రామకృష్ణులు చికీర్షాభవ్యులందుం
బ్రియంబుగ వాక్రుచ్చుచు మీకు నామకర

ణంబుల్ సేయు తన్నందభా,గ్యగురుత్వంబు భజిం
పశక్యమె కరాగ్రాంచద్ధనుశ్శంఖచ,క్రగదానందక
గోట్టు... 12

శా. సారప్రౌఢిమ పూతనాస్తనగుళుచ్ఛంబుల్ వడిం
బీల్చి; త,ద్ఘోరాకారము రూపుమాపినసమ,గ్రున్
నిన్ను సేవింతు; వి,స్ఫారతారకనామవర్ణఫలక
భ్రాజిష్ణు జిహ్వాగ్రవ,ద్గారిత్ర్యంబక గోట్టు... 13

శా. హంసల్ జోడుగఁ గూడియాడు నటి నందాగా
రసీమన్ వ్రజో,త్తంసుల్ మెచ్చఁగ వాసుదేవయు
గళత్వవ్యక్తిఁ జిట్టాడుమీ, సంసద్బాల్యవిలాస
ముల్ గనుట కున్నాస్నహించెదన్ జూపవే, కంస
ధ్వంసక గోట్టు... 14

మ. నిరతిన్ మించిన కాకపక్షములతో నిండారు వేన
స్థ్వాతీ, వరజాంబూనదచంద్రహారములతో వర్ధి
ష్ణులై నందగో, పురవీథిం జెలఁబాడుమీ చిఱుత
రూపుల్ చూపరావే;సుదా,కరుణావార్షిక గోట్టు.

మ. అలరన్ సువ్రతమెంతజేసిరొ వసంతారామసీ
మన్ జిగు,ళ్లలరన్ మేసెడుబాలకోకిలలయట్లుంబ
ల్కు మీతొక్కుఁబ, ల్కులు చెన్నారఁగ వీను
లన్ వినుటకుం గోపాంగనారత్నముల్, ఖల
దుర్ధర్షక గోట్టు... 16

శా. భావంబందు మిముఙ్ స్వవర్ణికులుగాఁ బాటించి గోపాంగనల్, తీవిఙ్ బొత్తులనారగించుచు సమష్టిఙ్ సేవగావించుత, త్త్కైవల్యంబు నుతింపశక్యమె సుహృత్సంరక్షణారంభ దీ, క్షావిస్తారక గొట్టు... 17

శా. భాగ్యైమించినపాలువెన్న పెరుగుల్ పైమీఁగడల్ గోపక, న్యాగారంబులు సొచ్చి మెక్కుచును శౌర్యప్రౌఢిఁ గ్రీడించుమీ, నైగారంబు నుతింప నాకు నశమౌనా దూయమానాభ్రగ, ర్వాగుర్వాంఘ్రికగొట్టు... 18

శా. ఏమీ యీనవనీతచౌర్యమని తల్లెంతేవిమర్శింపన, మ్మా! మన్నింపుమటంచు చూపవె విముక్తాస్యండవై లోజగత్, స్తోమంబెల్లఁ దనూఘనాఘనతటిద్రూపీ భవత్కాంచన, క్షౌమోద్దామక గొట్టు... 19

శా. చాలఙ్ నీపయిచోరవార్తవిని యిచ్చఙ్ నీపదాంభోజముల్, తోలంగట్టెను దల్లియంద్రు తలిదండ్రుల్ నీకునుంగల్గియుం, ద్రా? లీలామయచిత్స్వరూపివట క్రీడానాట్యరంగస్థల, త్కాలీయాహిక గొట్టు... 20

శా. ప్రీతిఙ్ మద్దు లులూఖలానియతి నుద్వేం

గూల్చి తదక్షసం, జాతద్వంద్వవిముక్తిఁ జేసి
తివి నీసామర్థ్య మార్గావన, ఖ్యాతిస్ఫీతము చక్ర
భానుపరిభూతామర్త్యవిద్వేషిసం, ఘాతధ్వాం
తక గొట్టు... 21

మ. గరిమం గోవులు గోపబాలకులు చొక్కంబొంబ
లంబొసిరల్, బురణింపఁ వనికేఁగుచో దారత
నంబుఁ నప్పుదాయెఁ నిజం, బరయఁ గొల్లఁ
డవై వనాఁడును హిరణ్యాక్షుకయార్థైకసూ,కర
తాభూమిక గొట్టుముక్కల... 22

శా. ధీరప్రౌఢిభజింతు నాయెదుట నెంతేమాధురీ
సాధురీ, తీరావంబగు పిల్లగ్రోలు మునుము త్తెం
నా దలం బింఛ మిం, పారఁ గన్పడవయ్య సా
ధుజనతాపాగ్నిచ్ఛటాటోపకృ, త్కారుణ్యోద
క గొట్టు... 23

మ. మురళీనాదవినోదమాధురికి సమ్మూర్ఛావిధిం
జొక్కుచుఁ, గరమొప్పారెడు ధేనుకోటియెడ
నీకారుణ్యపూరం బభం, గురతఁ మించునితాం
తకుంతల మిళద్గోపాదధూళీసము, త్కరపిష్టాత
క గొట్టుముక్కల... 24

శా. కుంజాగారములందు గోపవనితల్ గోపాలకుల్
మీరలుఁ, బుంజంబై వసియించి చల్దికబళం

బుల్ ప్రేమనన్యోన్యహా, స్త్రాంజల్యంతరభక్తిక్తి గై
కొనుట లయ్యావేడ్క కౌనాశర, త్కాంజాతాం
బక గొట్టు... 25

మ. పవిత్రుల్యాంబగు పాదసంహతి తృణావర్తుఁ బ
కుఁ వత్సదా, నవ్రునిఁ ఘోటకధేనుకాదిఖలు
లఁ మర్దించి నందాదివ,ల్లవులం బ్రీతులసేయునీ
గుణకథల్ వర్ణింతు హైరణ్యరాం, కవదివ్యాం
శుక గొట్టుముక్కల... 26

మ. అమరఁ లేఁగల బ్రహ్మ వంచనముసేయఁ వాని
నన్నింటి నం, దముగాఁ గల్పనసేసి నీవు నలువఁ
వంచించి లోం ద్రాదిదై, వము నీవేకద యీశ్వరీ
త్రితయిలోవత్సస్థలాలాలనభా, క్కమలాధేనుక
గొట్టు... 27

మ. తిరమై గోగణమొక్కనాఁడు వనవీథిఁ మేఁత
లాడంగ భీ,కరదావాగ్నులు జుట్టుకున్న సుధ
వేడ్కం గ్రోలుచందాన బం,ధురదావాగ్నులు
గ్రోలి గోవులను తద్గోపాలురఁ బ్రోచితౌ, గరు
డారోహక గొట్టు... 28

శా. నాకౌకస్సముమైన విప్రతతి నానాయాగముల్
సేయ నీ, వాకొన్నట్లుగఁజేసి తత్సతులు మృష్టా
న్నంబొసంగఁ శుభో, త్సేకం బెల్ల నొసంగినాఁ

డవఁట నీచిత్తం బమూల్యంబు లో, కైకత్రాణక
గోట్టు... 29

మ. మనుతం గోపకు లింద్రయాగ మొనరింపన్ వారి
వారించి శైలమువై పూజలుగాంచి గోగణము
నెల్లన్ బ్రోవవా! ఆలవర్షముగా కుండ నగేంద్ర
మెత్తి సురలార్వన్ భక్తసంరక్షణ, క్రమసంచా
రక గోట్టు... 30

మ. క్రమమొప్పారఁగ గోపకన్యకలు వస్త్రంబుల్
విసర్జించి యమున్యమునన్ నీరములాడ ముచ్చి
లి తదీయక్షామముల్ గొంచుభూజముపైఁ బ్రాఁ
కితివంద్రు గోగణపరిక్షా ప్రక్రియాజాగరూక మ
హావాంశిక గోట్టు... 31

మ. నిబిడాపీతమరంవతుందిలమిళిందీగీతరీతిన్ నెరా,
పొబఁగా నీమురళీరవామృతము లెచ్చోవిన్న
గోపీ స్తన, స్తబకంబుల్ పులకింపుచుండు శిఖి
పింఛాలాంఛితాళి ప్రభా,కబరీభారక గోట్టు...

శా. ఎంచన్ శక్యమె నీవిమర్శపసి నెందేమేఁతలాశిం
చుచోఁ, బంచాస్యంబులకైనఁగాని తలఁజూపన్
రామి గావింతువా, ప్రాంచద్గోనిచయాభివర్త
నగతిప్రౌఢిన్ స్వవధ్ఘంటికా, కాంచీదామక
గోట్టు... 33

శా. ఉత్కంఠన్ వ్రజసుందరుల్ మనములో నూహించ వాంఛల్ సదా, సత్కారించుచుఁ దృప్తి సేతు వట యెంచన్ శక్యమే! నీసము, ద్యత్కారుణ్యము బాణదైత్యబహుబాహాఖండనోద్దండరం, గత్కాండీవక గొట్టు... 84

మ. వలపుల్ నిల్పగలేము నీవుగృపమద్వర్యుండ వౌ మంచుల్, లలుగల్పించెడిగోపకామినుల నెల్లం గౌఁగిటం జేర్చి యు, చ్చలుబూరింతువు క్రీడసల్పి; రతికాంతాలోలగోపాంగనా, కలితస్నేహక గొట్టు.

మ. అసురల్ తాపసు లాగమాంతనిబిడేహన్ గాన లేనట్టినిన్, రమణుల్ గాంచుట కెట్లునోఁ చిరామహారణ్యంబుశోధించి సం, భ్రమ మొప్పన్ వినుతిక్రియాముఖరరుద్రాదిత్యగంధర్వయ, క్షమహారాజిక గొట్టు... 86

శా. శ్రీరంజిల్లఁగ నీవు నీపిలుఁద నారీరత్న మారీతివిస్తారస్నీలసువర్ణమాల్యవిధి రాసక్రీడ లాడించు మీ, తారుణ్యంబు మదిన్ భజింతు వ్రజకాంతానేత్రనీలోత్పల, గ్లౌరూపాత్మక గొట్టు... 87

శా. ఆవిర్భూతధృతిన్ సుదర్శనసమాఖ్యాహీంద్రమే తెంచి నం, దావాసంబునఁ జొచ్చి నందుని మహాగాఢత్వంబుచే మ్రింగ నెం, తో వేగంబున

దానిజంపి కృప నందుంబ్రోవవా మందర,గ్రావో
ద్ధారక గోట్టు... 38

మ. అమరంగంసనియు క్తఘోటకము ఖేంద్రారాతి
చేతిక్ సువి,క్రమమొప్పార వధించి పుచ్చు
టిది నీక ర్తవ్యభారంపుఁజం, దమెకా! దుర్జనఖండ
నార్థపరిలుంఠత్పూతనాపూర్వరం, గమహానాటక
గోట్టు... 39

మ. తనకుక్ మోక్షసుఖంబునిచ్చుటకు నుద్దామ
స్థితిక్ దోడితె, మ్మనిపంపించినమూడ్కి నీకడకు
నొయ్యక్ క్రూరుఁడై యుండి స,జ్జను నక్రూరుని
బంపె కంసుఁడు సదాసంచారయోగ్యత్రయీ,ఘ
నశృంగాటక గోట్టు... 40

మ. ధ్రువభ క్తిక్ వినుదోడుకొంచుఁజనియక్రూరుండు
కాళిందియం, దవగాహంబొనరించి తజ్జలమునం
దమ్మేటిమీలీల లు,త్సవమొప్పారఁగఁ గాంచె
ఫాలఫలకాబ్జాతభ్రమచ్చంచరీ, కవినీలాలక
గోట్టు... 41

శా. దభ్రాపేతగుణైకత త్త్వమగు నుద్యద్దివ్యతేజంబె
యీ, విభ్రాజిష్ణులు రామకృష్ణులన ద్వై విధ్యం
బునక్ బోల్చుమీ, సౌభ్రాత్రంబు భజింతు నెమ్మ
ది సుధాసంధానసంతృ ప్తలే,ఖభ్రూసంసకగోట్టు.

మ. తమకంబొప్ప తిరస్కరించురజకుం దండించి; మే
లైనవస్త్రములెల్లఁ దరియించినావు మధురా
ద్వారంబునఁ నీవెకా, సముఁడౌ సాంబనిమిత్త
హస్తినగరీసర్వంసహోత్పాటనో, గ్రమహాసా
లిక గొట్టు... 43

మ. జిగిరంజిల్లుసువర్ణభూషణము లిచ్చెఁ బాయకుం
డింపుసాం, పుగఁ బూదండ లొసంగె నర్మిలి
సుదాముం డుజ్జ్వలద్గంధచర్చఁ గడుం గూరిచెఁ
గుబ్జ మీకుఁ బరమార్థజ్ఞానసంపత్తిచే, ఖగరా
డ్ఘోటక గొట్టు... 44

మ. నరసింహాకృతి దానవద్విపకళానాశంబు గావిం
చునీ, బిరుదస్ఫూర్తికి లక్ష్యమాకువలయాపీడా
దులే! ముష్టికా, సుచాణూరకఘోరదుర్భర శిర
స్థానాశ్మనిర్ఘాతభీ, కరసంగ్రాహక గొట్టు... 45

శా. దృగ్లోభత్వమొనర్చె నీమృదులమూర్తిస్ఫూర్తి
సంపత్తి ని, త్యగ్లానిఁ హరియించె నీగుణకథా
తత్త్వంబు; నీమాధురీ, వాగ్లీలల్ వినసొంపులయ్యె
మధురావాసప్రజాశ్రేణికిఁ, కగ్లానంబక గొట్టు.

మ. అనుమానింపక మేనమామయని మోహంబింత
యుఁ లేక తా, మునుముఁ ముష్టికముఖ్యమల్ల
పతనంబుల్ విన్నవాఁడౌట యీ, నున గర్జిల్లెడి

సాధుసజ్జనజిఘాంసుం గంసు నిర్జింపవా, కనకత్కా
మక్ష గొట్టు... 47

శా. తాళంబుల్ ధరియించి నారదుఁడు గీతంబుల్
పఠించెఁ దతోఁ, ద్వేలప్రౌఢిమ నాడి రచ్చకలు
దోర్వీథిఁ బ్రవర్షంబులై, రాలెం బువ్వులు
కంసహింసనసుఖప్రబంధురాధామృగా,కాలిలా
దిక గొట్టు... 48

శా. కారాగారమునందు నున్న జనవర్గంబుంగటాక్షిం
చి వి,స్ఫారత్వోద్ధిమ నుగ్రసేనునకు రాజ్యప్రా
ప్తిగావించి దో,స్సారశ్రీమధురన్వసించితివి చం
చచ్చంద్రికాకారశ్మం, గారస్మేక గొట్టు... 49

మ. అమరుల్ సూరాదిపరుల్ సమస్తనృపతుల్ హ
ర్షింప సంభారక, త్వముచే యాదవసింహులై
మధురలో వర్ధిష్ణులై నిత్యసం, భ్రమముల్ గాం
చుమిముఁ భజింతు మదిలో బ్రహ్మాదిగీర్వాణ
లో,కమహాపూర్వక గొట్టు... 50

మ. పరమామోదధురీణబుద్ధి వసుదేవప్రార్థనం జేసి
స,ద్గురుఁడౌ గర్గమహామునీశ్వరుఁడుకోర్కుల్ నిం
డి దైవార సు,స్థిరతఁ మిమ్ముపవిత్రవంతులుగఁ
జేసెఁ దానసద్వ్యశశ్శుభం,కర విజ్ఞానిక గొట్టు...

మ. ప్రవణఁ సర్వజగద్గురుత్వకలనఁ బాటిల్లు

మీఁకుఁ మహో,త్సవమొప్పారఁగ విద్యలెల్ల
గరపెఁ సాందీపుఁ డాచార్యధ, ర్మవిశేషంబున
నెంతవింత గిరిశబ్రహ్మాదిదైవప్రతీ,క్ష్యవిరాడ్రూ
పక గోట్టు... 52

మ. అణుమాత్రంబున దక్షిణార్థమని నిఁబ్రార్థింపఁ ద
త్సూను మా, రణమైపోయినవానిఁదెచ్చి గురు
నారాధించునీకార్యనై, పుణి వర్ణింపఁగ నీప్రసి
ద్ధికి నెఱాపొందార వందారుర, క్షణతాత్పర్య
క గోట్టు... 53

శా. భావంబందు విరోధవహ్ని దహియింపఁగావచ్చి
పల్మాఱు రో,షావేశంబునఁ దారసించిన జరాసం
ధుఁ బరాభూతనా, నావైదగ్ధ్యనిజేసినావు ప్ర
జకాంతానిత్యకారుణ్యలే,ఖావాత్సల్యక గోట్టు.

మ. గుణహీనుండయి తారసించుయవనుం గొంపో
యి యున్మీలితే, క్షణుఁడౌ నమ్ముచికుందుచేత న
తనిం జంపించి తద్భూఖవర, ప్రణతుల్ గైకొని
ప్రీతినొందిననినుఁ బ్రార్థింతు సన్మానిర,క్షణ దా
క్షిణ్యక గోట్టు... 55

శా. నీపాండిత్యము లెక్కసేయ తరమే నిర్మించినా
వౌ మహా,కూపారంబున ద్వారకాపురము కో
ర్కుల్మీఱఁ దత్సంస్మృతిం, బాపౌఘంబు తొలంగు

౦త సకలబ్రహ్మాండనిర్మాణదీ, ర్ఘాపారస్త్వక
గోట్టు... 56

మ. సరసీజాసనునాజ్ఞ నాత్మతనయుణ్ సౌదామినీవి
గ్రహుణ్, వరకన్యామణి నిచ్చె రైవతుఁ డనర్ఘ
చీనజణ్ రేవతిణ్, నిరతిణ్ శీరికి నిత్యనామభజ
నానిర్వ్యాపకారప్రియం, కరవైమానిక గోట్టు.

మ. కృపణుణ్ జైద్యునిదోలి తద్వివాహితురుక్మిం జాల
భంగించి శౌ, ర్యపటుత్వంబునఁ దెచ్చి రాక్షసవి
వాహస్ఫూర్తిచే రుక్మిణిణ్, విపులప్రేమ వరించి
నాంచవు శుభాప్తిణ్ గోపికాచిత్తస్థై, కపరా
స్యంధిక గోట్టు... 58

మ. అసమణ్ శ్రీసతులౌట రుక్మిణియు సత్యాజాంబ
వత్యర్కజా, తరుణుల్ లక్ష్మణయుణ్ సుదంతయు
సుభద్రామిత్రవిందల్ శుభస్థిరతణ్ పీసతులైరి
ఘోషనిలయశ్రీ రాజ్యధారాదిత, స్వరతాధూ
ర్తక గోట్టు... 59

మ. త్రిజగద్బాధకు నుగ్రదైత్యు నరకుం దీవ్రాజిరం
గంబులో, ధ్వజినీయుక్తముగాఁగఁ ద్రుళ్లడఁచి
తద్బంధీకృతానేకభూ,భుజకన్యామణులణ్ వరించి
తివి సంపూర్ణానురక్తిణ్ గదా, గ్రజదైత్యాం
తక గోట్టు... 60

మ. పదియార్వేవురుగోపకన్యకలునుఁ భార్యాష్టకం
బుఁ శుభా,భ్యుదయంబొప్పఁగఁ బుత్రపౌత్రనిచ
యంబుఁగల్గుత త్త్రిప్రియ, ప్రదసంసారివి నిత్య
భక్తి నిరతవ్యాసాంబరీషాదిభ, క్తదయాకారక
గొట్టు... 61

మ. అనయంబుఁ నిను పారిజాతకుసుమం బర్థింప
మేలంచుఁ జ,య్యన నింద్రాదులఁ గెల్చి తెచ్చితివి
సత్యావాంఛితార్థంబు నం, దనమందారము వల్ల
వీనిచయచేతఃపంజరాంతర్మిళ, ద్ఘనకేళీశుకగో
ట్టు... 62

మ. ప్రసభప్రౌఢిప్రసేనుజంపెనని సత్రాజిత్తు నీయందు
నిం,దస మర్థించినఁ దచ్ఛమంతకనిమిత్తంబేగి యు
గ్రాజిలోఁ, వెసభల్లూకపతింజయించి మణినీవేయి
చ్చితో భక్తము, ఖ్యసమాసాధ్యక గొట్టు...63

మ. సముదంచద్గతి నీవు పాండుసుతపక్షంబైన కారు
ణ్యాసం, భ్రమ మేపారఁగ హస్తినాపురముఁ జేరం
బోవు నెయ్యంపుఁజం,దమువర్ణింపఁ బరంబె! సాము
జపరిత్రాణార్థచక్రప్రశి, క్షమహావక్రక గొట్టు.

మ ఖచరాధీశ్వరుఁ దోలి ఖాండవవనగ్రాసంబు గాం
డీవిచే, శుచికిఁ దచ్చుచిచేత గాండివధనుస్తూ
ణీరముల్ క్రీడికిఁ, బ్రదురంబొప్ప నొసంగఁజే

సినవినుఁ బ్రార్థింతు నంభోరుహా, క్షచిదానందక
గొట్టు... 65

మ. అనిలో బాణుని శోణిపట్టణమునం దబ్జాక్షుఁ
డీశుం జ, యించెనటం డ్రాతఁడెనీవు నీవెయతఁ
డశ్రీకైకసువ్యక్తు లొ,య్యన మీలోపల హా
చ్చుతగ్గులనికద్దా! సాధుసత్కార్య ద,క్ష నృహా
ర్యక్షక గొట్టు... 66

మ. త్రిజగత్కంటకు బాణదైత్యు నని లోఁదీవ్రంబు
గాఁ దాఁకిత,ద్భుజముల్ ద్రెంచి యుషాసమేతు
ననిరుద్ధుం దెచ్చి యొప్పారునిఁ, భజియింతుఁ
బదపద్మసంజనితశుంభద్వాహినీదిగ్ధభ, ర్గజటా
వాటిక గొట్టు... 67

మ. సరటాకారము మానిశాపకలనఁ సంప్రాప్తమైనం
బరం, పరశోషిల్లుచు నిఁ భజింప నృగునిం బా
లింపవా! కూపగ,హ్వరముం బాపి కృతార్థుఁజేసి
భళిరే! యార్తార్తపీడానిరా, కరణవ్యాపక
గొట్టు... 68

మ. ఎవరైనఁ మిమునిందజేసిన జయంబెట్లొందుఁ
దా! రాజనం,చువెసఁ మిమ్ముహసించి రుక్మియు
మిముఁ సోల్లుంఠనంబాడి య,వ్వవిదుండుఁ
నశియింపరే హాలధరోద్వృత్తిఁ సురారాతి
శుం,ష్కవనీపావక గొట్టు... 69

మ. యమునం దావసియించుబోటి కిల వ్రయ్యల్ చేసి
రప్పింపఁడే, రమణన్ రాముఁడు లాంగలాగ్ర
మున మీరాజత్ప్రభావంబు ల,య్యమరశ్రేణు
లకైన నెన్నవశమౌనా ! సంగరాభంగశా,ర్ఙమ
హాకార్ముక గోట్టు... 70

మ. నిమిషార్ధంబున సూతునైమిశమునన్ నిర్జించినన్
శౌనకా,దిమునుల్ వేగహలాయుధుం డతని నెం
తేజీవితుం జేసె లో,కము లెన్నన్ నిబిడానురాగ
మున రంగద్రుక్మిణీదత్తహృ,త్కమలారాత్రిక
గోట్టు... 71

మ. కురురాజన్యుఁడు క్షితినొంద హాల మత్యుగ్రం
బుగన్ సాచి త,త్పురి యొడ్డేర్పడ గడ్డయెత్తె
బలభద్రుం డండ్రు; మీశౌర్యవై,ఖరి మీకే తగు
గాక యొల్లకగునా కౌంతేయ సద్భోగభా,గ్య
రమాస్థాపక గోట్టు... 72

మ. అరిభావంబుననైనఁగాని నిను నిత్యంబాత్మఁ
జింతించినన్, బరమానందపదంబు సంభవిలు
కార్పణ్యంబుచేఁ బౌండ్రకుం,డరియై నిన్నె భజిం
చి ముక్తిఁగనె దేహాంతంబునన్ గాలపు,ష్కర
ముక్తేచక గోట్టు... 73

మ. గరిమన్ నిన్ను బరీక్షసేయ భవదాగారంబులన్

జేరి నిర్జరమానీంద్రుఁడు మోసపోయెను భవ
ద్రాఘిష్ఠమాయాసము,త్కరపాథోనిధియందుఁ
గూలి దరిజెందఁ లేక సాధుప్రియం,కరసంకల్పక
గోట్టు... 74

శా. రంగద్ధర్మజరాజసూయమఖసంరక్షాపేక్షకై భీము
చే,తం గర్వాంధుజరాసుతుం గెడపి తద్ద్రవ్యం
బుసాధించి ప్రీ,తిం గౌంతేయుల దన్పినాఁడవు
భళీ దివ్యాంగవల్లీవిశ, ద్గాంగేయాంశుక
గోట్టు... 75

మ. పటిమం ధర్మజు చేతఁ బూజఁగొనునిం భర్జించి
చైద్యుండు దు,ర్ఘటముల్ బల్కిన తచ్ఛిరంబు
సభవారల్ మెచ్చ చక్రాహతిం, ఘటికామాత్ర
ములోన ద్రుంచితివి నక్రగ్రస్తఖిన్నేభసం,కటని
ర్మోచక గోట్టు... 76

మ. అమృతాంధఃపథగామి సౌంభకపురస్థాభీలసా
ల్వాదులం, సమదాటోపులద్రుంపవే సుజనతా
సంరక్షణార్థంబు చ,క్రముసారించి సురావనార్థ
బహుధాకర్తవ్యదై తేయసం,ఘమృగాఖేటక గో
ట్టు... 77

మ. చెలువొప్పారఁగ నీకుఁజేరెఁ డటుకుల్ చిక్రోడ
భక్తిక్రియా,కలనం దెచ్చి కుచేలుఁ డర్పణము

సంగన్ వాని కీనేర్చితా, పొలుపొందన్ గృపచే
సము_స్తవిభవంబుల్ దేవకీగర్భశం, ఖలసన్మా_క్తిక
గొట్టు... 78

మ. స్ఫుటసద్భ_క్తియుతాత్ము: ద్దైనబహుళాశుఁన్
నిత్యసత్యవ్రతో,ద్భటురాజర్షి నిగాంచి పూజగొని
తద్భావంబునన్ నీవు ప్ర,త్యటనంబందితివౌర సన్ము
నిమ:నీమారామ నిస్ఫూ_ర్తిసం, ఘటనాచైత్రిక
గొట్టు... 79

మ. అకలంకస్థితి తల్లి వేఁడిన వరం బాలించి పాతా
ళలో, కకృతావాసుల తన్మ,హాగర్భులవేడ్కన్
దెచ్చుసద్యఃకృపా,ర్థికులన్ విమ్ముభజింతు పార్థ
శుభకృద్దీలారహాస్యప్రసం,గకళాబోధక గొట్టు.

మ. కుహనానూనిశచ్చి యాదవులగై కోకన్ సుభ
ద్రన్ మహా,మహుఁడై చేకొని పోవునర్జునుని
సన్మానించు నీసౌహృదం,బహహా! యెన్నఁదరం
బెహాంసఁడిభ కానో,న్యన్యఘ్న తాం హేతువి,గ్రహస్ఫూ
ర్త్యాయిక గొట్టు... 81

మ అబలాగర్భము గావబూని యి గాయన్
లేమికిన్ రోసిబా,డబుడెగ్గాడిన మాన్పి తత్సుతు
లజాడల్ జూపి సత్కీ_ర్తినొం,గబడెన్ పార్థుఁడు
నీసహాయమపటిమన్ దైత్యఘ్నుతో దృష్టివి, క్లబ
బృందారక గొట్టు... 82

మ. కపివంశాగ్రణి వైనవాయుజునితో గర్వించి
గాండీవిమో,సపడన్ గ్రీడికి బాగాసంగ హను
మన్ సాధించి పార్థధ్వజా,ధిపుఁగావించితి వక్ష
యచ్ఛరసమృద్ధి ద్రౌపదీమానభం,గహరి త్రాణక
గొట్టు... 83

మ. దవముం బోలె మహర్షిభిక్షయని రాఁ దచ్ఛాం
తికై ద్రవ్యముఁ, ఉపమూత్రార్పిత శాకపారణ
ముపల్లన్ సేయవా తృప్తి! మే,ల్గనయం బ్రాణుల
కెల్ల భండనకళాఖండీశవద్దంతవ,క్రవిదూరాదిక
గొట్టు... 84

మ. కురురాజన్యుఁడు వాసవాత్మజుఁడు కోర్కుల్
మీఱఁగా విన్న సం, గరసాహాయ్యము వేఁడ
రాజునకు వేడ్కన్ సేనలంబంపి నీ, వరయన్
సారథివైతి పర్జునున కత్యంతాప్తిచేఁ గోటిభా,
స్కర తేజస్విక గొట్టు... 85

మ. అమరం గౌరవకోటికెల్ల పటుశౌర్యప్రౌఢిమన్
విశ్వరూ,పము జూపించుచు విందుసూతజుఁ డౌన
గ్వన్ భోక్తవై రాయబా, రముపాటించినవిన్
భజింతు హితసంసారార్థలీలాధృతాం, గమ్ము
పాలౌకిక గొట్టు... 86

మ. అసమప్రౌఢిమ సైంధవుం గెడప దీక్షాయత్తుఁ డైన

ట్టియుం, ద్రసుతుం బ్రీణితుసేయఁ దజ్జయనిమిత్త
వ్యాప్తికై యవ్విభా, వసునిం గప్పితి వెంతవింత!
భజనాపారీణతద్ జ్ఞాపన్న, గ్గసుఖప్రాపక గోట్టు...

మ. అమరం గర్ణుని నాగపాశమును ద్రౌణ్యా ప్తిలది
వ్యాస్త్రముల్, సముదంచద్ధృతరాష్ట్రజృంభణ
ము గాంధారీవిచారాగ్నియుల్, క్రమయత్నం
బులమాన్పి పాండవుల వేడ్కంబ్రోచినావార
భ, క్తమనోరంజక గోట్టు... 88

మ. విలసన్భూన్యభవత్తనూభవులకుల్ విద్యాగురుల్
మూఁడుకో, టులపై నెన్బదివేలమందియట తో
డ్తో వారికిల్ సంఖ్యసు, ధిలగాఁ బుత్త్రకు లెన్ని
యర్బ్బుదములో నీకగ్రపుత్రీభవ, త్కలహంసా
శ్వక గోట్టు... 89

మ. ఉరుశౌర్యాఢ్యుఁడు రుక్మిణీసతికిఁ బ్రద్యుమ్నుం
డు నమ్మేటికిల్, వరపుత్రుం డనిరుద్ధుఁ డాఘనున
కావజ్రాభిధానాంకుఁ డీ, సరణిల్ వంశసమృద్ధిగ
ల్గిన మహాసంసారి వౌరౌర సా, గరజామాతృక
గోట్టు... 90

శా. నీజాగ్రత్ స్థితి సాధురక్షణకళానిత్యంబు నీలీల
నా, నాజంతుప్రజజన్మపోషణలయానందంబు నీ
మాయ భా, షాజాన్యాదిదురాసదంబు యదు
వంశక్షీరవారాశిరా, కాజైవాతృక గోట్టు...

శా. అభీలాసురవంచితుం డయినబ్రహ్మన్ వేదవి
ద్యాపున,ర్లాభామోదితుఁ జేయునీకు ఝషలీలా
మూర్తికిన్ దీనర, క్షోణీభారంబు వహించు టెంత
పని; హా స్తన్యస్తగోవర్ధన, క్ష్మాభృత్కందుక
గొట్టు... 92

మ. రుచిరప్రేమ గుచేలు సుద్ధవుని నక్రూరున్ బరీ
క్షిత్తు న, మ్ముచికుందుం గరుణించినట్లు పరమా
త్మున్ గాంచనాంచన్మహా, విచయున్ నిన్ను భజిం
తు నెమ్మదిని లక్ష్మీనిత్యభోగానురా, గచిరంభా
వుక గొట్టు... 93

మ. అలబృందావనవీధి ధేనువుల నెయ్యంబారఁ
బాలించువే, శల నీ వందాక గోవుగన్పడిన వెళ్లం
దోలితో నేను న,ట్టుల నజ్ఞానిని నన్ను బ్రోవు మిం
కఁదోడ్తో భక్తరక్షాసమా,కలితారంభక గొట్టు!

శా. తోరంబైనమదీయభాగ్యమది యెంతో కాని మ
జ్జిహ్వాకున్, సారస్యంబుగఁ గ్రోలఁగాఁగలిగ
యుష్మన్నామచింతాసుధా, పూరం బాస్తతచేఁ
బ్రథానగరద్భాలోకవైకుంఠశ్రీం, గారద్వా
రక గొట్టు... 95

శా. సంప్రీతిన్ నినుసంస్మరించెదను మత్స్వాంతం
బులో నిల్వవే!, సుప్రజ్ఞానిధులైనభక్తులమదిన్

సాంపొప్పఁగా నీవు ని,త్యప్రామాణ్యవిధిన్ వసిం
తువని యం. ద్రంగీకృతాచత్పిశం, గప్రావారక
గోట్టు... 96

శా. నీసౌందర్యగుణంబు లెంతు మదిలో నిన్నే
నుతింతున్ నెఱా, నీసంకీర్తనలాచరింతునను నీని
త్యానుకంపాసుధా, సారంబునఁ దేల్చు మిం
క కచులాగంధస్థలీపత్రరే, ఖాసంలేఖక గోట్టు...

శా. వాలాయంబుగ నిన్నె కొల్తు నినుఁ గైవారంబు
గావింతు నీ, లీలల్ వర్ణనసేతు నీదుకథ లాలిం
తున్ భవత్సత్కృపా, ప్రాలేయప్లుతుఁ జేయవే
నను రమారామామణీపాదలా, క్షాలిప్తాంబక
గోట్టు... 98

మ. నవనీతాత్ముఁడ వీవు నేగ్రహణుఁడన్ నన్నేల న
శ్రద్ధసే, యవిచారింపకుఁ బ్రేమ నిల్పుము కరం
బర్థింతుఁ గైకొమ్ము మ, త్కవితారామము శౌన
కాదిమునిబృంద స్వాంతమాకందవృ, క్షవిరాజత్పి
క గోట్టు... 99

శా. శ్రీమన్మూర్తివి నీవు నిన్ దలఁతు నీచే సంపదల్
గాంతు నీ, కైమోడ్పుల్ పచరింతు నీవలన మో
క్షప్రాప్తిసాధింతు నీ, కామోదంబుగఁ గూర్తు
నామనసు నీయందేసుమీ సత్యరే, ఖామాహా
త్మ్యక గోట్టు... 100

శా. శ్రీమత్కాశ్యపగోత్రదిట్టకవివంశీయాఘ్యుఁడన్
రామచంద్రామాత్యాంకుఁడ నీకథల్ శతకప
ద్యారూఢిన్ వాక్రుచ్చితిన్, స్వామీ యీశతకం
బు గైకొనుము నీసామర్థ్య మత్యంతమౌ, గాను
తోప్రేమక గొట్టు... 101

మ. పరగం గ్రిందటిజన్మజన్మముల నిన్ బ్రార్థింప
లేనైతి ని, న్నరరూపంబునఁ గొల్వఁగంటి నిటతో
నాకబ్బెసన్ముక్తి సు,స్థిరమై యర్జునసాహసార్థభగ
వద్గీతాగహస్యప్రియం, కరవాచాలక గొట్టుము
క్కలపురౌ కా రాజగోపాలకా. 102

గొట్టుముక్కల రాజగోపాలశతకము
సంపూర్ణము.



# పీఠిక.

ఈశతకము రచించినకవి దిట్టకవి రామయోగి దీక్షితులు. ఇతఁడు కాశ్యపగోత్రుఁడు. నందిగామ తాలూకా గొట్టుముక్కల నివాసి. చిరకాల మీకవి నూజవీటిలో నారయప్పారావు బహద్దరువారి యాస్థానమునందుఁ బౌరాణికుఁడుగ నున్నటులఁ గవివంశీయులు చెప్పుచున్నారు. ఇక్కవి రంగారాయచరిత్రము రచించిన నారాయణకవిమనుమఁడు. ఈయనతండ్రి సుందరరామసూరి. తాత యాదవరాయకవి. జనకపితామహులప్రతిభావిశేషములు తెలియవు.

రామయోగికవి సంస్కృతమున నసాధారణపండితుఁడు. ఒకమా టీకవి తమప్రభువర్యునితోఁ గాంచీనగరమునకేగి యటనున్న మహాపండితులతో వ్యాకరణశాస్త్రమునఁ జాలదినములు వివదించి విజయమంది బ్రహ్మరథము పీతాంబరసత్కృతి నూటపది యాఱురూపాయలు సభాసత్కారము సేలువులు బహూకృతిపొంది గృహాభిముఖుఁ డాయెనఁట. నాఁడు మొదలు నేఁటివఱకుఁ గాంచీనగరవాసులు

ఆంధ్రులు విద్యావాదములలో గడుసరులనియు నెవరిచే జయింపఁబడని కాంచీనగరపండితుల నాంధ్ర నియోగి జయించెననియుఁ జెప్పుకొనుచుందు రని కవి వంశీయులు చెప్పుచున్నారు. వ్యాకరణశాస్త్రపారంగతుఁడును పండితోత్తముఁడు నగు రామయోగి రచించిన యీ శతక ప్రశస్తినిగూర్చి ప్రత్యేకముగా మేము చెప్పవలసిన దేమియు లేదు. ఇక్కవి సంస్కృతమునఁ బెక్కు గ్రంథములకు వ్యాఖ్యానములు మతవిషయికఖండనగ్రంథములు రచించెను. కవి తన యుత్తరవయస్సులోఁ దనగ్రంథసముదాయముతో మచిలీపురమునందు నివాస మేర్పఱచికొనెను. ఉప్పెనవచ్చుటచేఁ గవివ్రాసిన గ్రంథములన్నియుఁ జరాస్తియంతయు సముద్రార్పితమైనదనియు నెటులో దైవవశమున రుక్మిణీపతిశతకముమాత్రము బైటపడినదనియుఁ గవివంశీయు లెఱింగించిరి. మాకులభించినరుక్మిణీపతిశతకమాతృక కొండపల్లి పీచుకాగితములపై అగురుసిరాతో వ్రాయఁబడియుండెను. పుస్తకము ఒకటిరెండుమాఱులు సముద్రస్నానముగావించినటులె యుండెను. కొన్నిచోటుల వర్ణములు పద్యపాదములు చెరిగిపోయెను. కావుననే

పూర్వగ్రంథములన్నింటికిఁ బ్రత్యంతరములు వ్రాసి పలేఖకులు దీనిని ముట్టుకొనరైరి. ఇఁక నుపేక్షించిన మొడల నీపుస్తక మదృశ్యమగునేమో యని శ్రమ చేసి యథాశక్తిని శుద్ధప్రతిని సిద్ధపఱచి ముద్రణ మున కొసంగఁగలిగితిమి.

ఈకవివ్రాసిన రెండుశ్లోకము లొకజీర్ణపత్రము మీఁదనుండఁగ యథారూపముగ వ్రాసితిమి. ఈశ్లో కద్వయమువలన నీకవి సంస్కృతకవితానైపుణ్యము బోధకాఁగలదు.

శ్లో. మేఘుస్స్వనీరదఘనాఘనతా ప్రసిద్ధి
స్సంపశ్య కేవలఘనం సరదం ప్రసిద్ధం
శ్రీనారయప్రభువరం సరదం ప్రసిద్ధం
సంపశ్య కేవలఘనం ముఖవర్ణ భేదీ
మోఘూభవ త్యనుపమోహి సరాజవర్యః.

శ్లో. విరాజతే లోకవిరాజిరాజతా
విభాకరే సంస్థితి మేతిహంసతా
సరాజహంస స్సమదీపిసర్వదా
సదాఖ్యయా నాగయ భూపవర్యః.

ఈకవి కాంధ్రకవితయం దంతనైపుణ్యము లేదు. కాని సుప్రసిద్ధకవి వంశజుఁడును పండితోత్తముఁడు

నగుటచే నీశతకమును రామయోగి మనోజ్ఞముగ వ్రాసియున్నాఁడు. చిరకాలమునుండి మూలఁబడి యున్న యీశతకము శుద్ధప్రతి వ్రాసికొనుట కిచ్చి ముద్రణమున కవకాశము కల్పించినఁ గవితమ్ముని కుమారు ఁగుదిట్టకవి సుందరరామయ్య శర్మ పాకయాజి గారిని బ్రశంసించుట ధర్మము.

కవి రమారమి యేఁబది సంవత్సరములపై కాలమున నూజవీటిలో మరణించెను.

నందిగామ.
1-4-25

ఇట్లు భాషాసేవకులు,
శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్రీరస్తు.

కిట్టకవి రామయోగిప్రణీత

# రుక్మిణీపతిశతకము.

---

ఉ. శ్రీకర సాంకవాంగమృతవీకర చాఱుకెలాంకరాస్వచా
మీకరచేల శ్రీకర సమీకరమాకర వారిజాత
మైత్రీకర పాదపల్లవసుధీనుతమానిత దీనమా
నవాళీక నగాంక బంధురజనీకరలోచన రుక్మిణీ
పతీ 1

చ. జలధరనీలగాత్ర దనుజవ్రజకంఠఖనిత్ర కల్యవా
గలఘుసుపర్వవర్ణ్యనుతియుతాత్మవిచిత్ర చరిత్ర
వర్తులాంకలితకళత్ర పాపలతికాశితదాత్ర పతత్రి
నేతృపత్ర లలితవక్త్ర సంకుమదరాజితచిత్రక
రుక్మిణీపతీ 2

ఉ. బాల విశోక పాకలితఫాల దయాసువిశాలలో
లసల్లాలకజాల గైరికసమంచితచేల తమాల
భూమిజాభాలలితాంగ జాలపవయాన భవస్తుత
శీల దేవతాపాల విరోధికాల శిశుపాలవిపా
లక రుక్మిణీపతీ. 3

ఉ. దండితవైరితండహిమధామ సమంచితతుండవా
జిరాట్కాండ విశాలకుండలయుగద్యుతిమండిత
గండసుస్తవే,దండపచండ సద్మగతవండక పాతక
సంతమిశ్రమా,ర్తాండ నమస్క్రియాపరసుధాశ
నిమండల రుక్మిణీపతీ. 4

ఉ. భూసురవారపోష పరిపూర్ణసుధాసమభాష
దేవతా,గోసముదాయపోష జితఘోరతరాద్భు
తదోష భూషణో,ద్భాసితవేష దాసజనపంక
జపూష చతుర్ముఖాదిశ,స్తాసనుసన్మనీష విబుధా
హితశోషణ రుక్మిణీపతీ. 5

ఉ. అంగజరూపసన్నుతసితాంగ విహంగతురంగ స
త్కృపా,పాంగరథాంగసంగ పరిపాలితదేవకదంబ
మౌనిసా,రంగతమఃపతంగ కలుషాంగద భంగర
థాంగభీతిమ, త్సాగరరంగఖండితనిశాకరపుంగవ
రుక్మిణీపతీ. 6

ఉ. దేవ మహానుభావ ఖచరీధరసన్నుతభావ దైత్యవి
ద్రావ భయానకౌఘగదదావ సమంచితభూరి
కంకణా, రావ ముఖాంబుజాతవిసరన్నయ
భావ కరాంగుళీధృత,గ్రావ దయాకటాక్షపరిర
క్షితసేవక రుక్మిణీపతీ. 7

ఉ. రక్షితనాగభాసురపరాగ భయంకరశౌర్యవేగ

సం, శిక్షితదైత్యపూగ మునిసేవితపాదపరాగ
సత్కటా, క్షుక్షుణయోగ యోగబలఖండితకిల్బి
షరోగ రాగర, క్షకపణానురాగ కృతదైవత
భోగక రుక్మిణీపతీ. 8

ఉ. రాజిత తేజ గుప్తగజ రాజమనోజ్ఞకళామనోజ సా,
మ్రాజబిడౌజ వక్త్రసదృశాంబుజ రాజనికారిలోచ
నాం,భోజ దయాకటాక్షపరిపోషితగోపసమాజ
భక్తనో, భూజ గృహీతసర్వజనపూజ గదాగ్రజ
రుక్మిణీపతీ. 9

ఉ. కోమలనీలదేహ మునికుంజరనిర్మలచిత్తగేహ పు
త్రామితమోహ భక్తనివహాపదుషర్బుధవారివా
హ ఘో, రామరవైరిదాహ విశదాననవాహవి
పూరితవ్రజ,స్తోమలసత్సమీహ సతశోకతమోప
హ రుక్మిణీపతీ. 10

చ. చతురవచఃకలాప మణిచారుకలాప మనోజరూ
ప స, స్తుతిపరమేరుచాప పరిశోధితదారుణపాప
గోప దు, ర్మతిదురవాప ఘోరరిపురాష్ట్రతిగర్వ
విలోప శాపసం, హృతమునితాప భక్తజనహృ
త్కమలాతపరుక్మిణీపతీ. 11

ఉ. పాతకకాననవ్రజనిపాతసుహేతి వినాశితామ
రా, రాతి మనోహరాకృతివిరాజితనాథనిచింతన

ప్రణ, త్రాతతభీతి వర్ధితపదాబ్జయుగా శ్రితమాన
వౌఘస,ద్యూతి ముఖాంబుజాతపరిభూతనిశాపతి
రుక్మిణీపతీ. 12

ఉ. విశ్వనివాస విశ్వకర విశ్వవిదూరక విశ్వసుందర
యో, శాశ్వత విశ్వరూప భవశాసనవిర్మలనిర్వి
కార లో, కేశ్వర దేవదేవ నిను నెంతటివాఁడ
నుతింప నోపత, త్ర్యక్షపురాణపూరుష చిదాత్మ
నిరంజన రుక్మిణీపతీ. 13

ఉ బంగరుచేలగప్పి సకపాంగవిలోకనలీలనొప్పి న
వ్యాంగదముఖ్యభూషణసమంచితవేషముతోఁడఁ
గూడి సా,రంగమునందుఁ బూనినదయంబున నా
కు భవత్పదాంబురు, ట్సంగతి నీయఁగోరెదను
సారసలోచన రుక్మిణీపతీ. 14

ఉ దండము గోపయూవతకదంబకుచస్థలపత్రలేఖనా
ఖండచమత్క్రియాంచితనఖక్షతచందిరఖండలా
లిత, (?)త్కాండజలోచనావృతసకాశసుదేశలస
త్కవేల స,త్కాండవవర్తి నేత్రయుగతామర
సాంఘ్రిక రుక్మిణీపతీ. 15

చ. దరదరవిందలోచన సుధారసభాసురహాసయో
ధరా,ధరధర దారితారి జనతారక తారపటీరహీ
రకుం, దరసమరాళగౌర యశతామరసోదర

భక్తసాదరా, ఖరకరచారుతేజ భవకాననపావ
క రుక్మిణీపతీ. 16

ఉ. తమ్ముల కెమ్మెచే మలినదమ్మగు నెమ్మొగముం గర
మ్ము భ, వ్యమ్మగుసొమ్ము కెంజిగురుటమ్ముల వేలుపు
టమ్మకుం శివా, సమ్మగుటొమ్ము నెమ్మిపురిసమ్మిళి
తంబగువేణినుందరం, తమ్ములు గల్గుదేవ మిము
నల్పెద నెమ్మది రుక్మిణీపతీ. 17

ఉ. పాతకతూలసంహతికిఁ బావకకీల నిరంతరంబు కం
జాతభవా ప్తబంధుపునిశాకరకోటికిఁ జిత్తభీకరం
బాతతభూతసంతతుల కానగణింపఁగ నీదునామ
మా, రాగిల నంగ భక్తగజరాజితపాదక రుక్మిణీ
పతీ 18

ఉ నందనమాచరింపు సురనందితసుందరపాద దేవకీ
నందన భక్తచందన సనందముఖస్తుత మామనో
కజేం, దిందిర మందహాసయుతుఁ దీరగుతావకవక్త్ర
కంజ బిం, పొందఁగఁజూపు మాకనులనొప్పుగఁ
జూచెద రుక్మిణీపతీ. 19

ఉ. సంచితపుణ్యరాశి యగుచంద్రవిభావన నీవుగల్గఁ
గాఁ, గొంచెపుదేవతాతతులఁ గొల్తురు ధీబల
హీనతం బయో, దంచితగాంగసైకతమునందు
జలార్థము ద్రవ్వులీల స, త్కాంచననూపురోల్లసి
త కమ్రపదాంబుజ రుక్మిణీపతీ. 20

ఉ. భక్తచకోరజాలపరిపాలనచంద్ర ధురావహాంబు
లై, దిక్తటసంచరద్రుచుల దీప్తములౌ భవదీ
యపాదను, వ్యక్తనఖాంకురంబు లనయంబును
మామకచిత్తవీథి సం, సక్తతనొందఁజేయఁగదె
సారసలోచన రుక్మిణీపతీ. 21

ఉ. నందునియందు నాద్రుపదనందినియందు యశో
దయందు నా,మందలయందు మానిజనమండల
మందును భీష్మునందు నే,చందమునన్ గనంబ
డెనో చక్కనిమీకరుణాకటాక్ష మా,చందము
నమ్ము దైన్యకము సల్పుము నీ వికరుక్మిణీపతీ.

ఉ. శంకరమిత్ర నీచరణసారస మాత్మనిరంతరంబు
ని,శ్శంకఁ దలంచువారల కసాధ్యమొకించుక లేద
టంచు నే,ఖాంకరణంబు మీఱఁగ శుభంకరభేరి
గజంబునెక్కి యా,తంకములేక సాఁదను దార
గుణాకర రుక్మిణీపతీ. 23

ఉ. కోరితి మీపదాంబుజము కూరిమిచేఁ బరదేవ
తాతతిన్,జేర నదెట్లటన్న; మదసిక్తమతంగజగం
డమండలీ, చారుతరస్థితింబరగుషట్పద మొందును
గాక యుజ్జ్వల,త్తైరిభ మొందునే వికచసారస
వాసన రుక్మిణీపతీ. 24

ఉ. మిమ్ముల నమ్ముకొంటి నిటమీఁద మఱెవ్వరి వేఁడ

నంటి మీ, తమ్ముల గేరు నెమ్మొగ ముదంచితరీతిని
జూపుమంటి నా, సామ్మునునీవయంటి మధుసూద
న నన్నరుణింపుమంటి నా, నెమ్మది మీపదాబ్జముల
నిల్పుమటంటిని జానకీపతీ. 25

చ. గజపతిఁ బ్రోచినాఁడవని కామినికోర్కులొసంగి
తంచు సద్విజునిగుచేలు నేలితనివించు భవచ్ఛర
ణంబు వేఁడితిక్, భజనముజేయువారలఁ గృపా
వతిఁ బ్రోచెదితండ్రి పాతక, వ్రజములడంచి బ్రో
వఁగదె పంకజలోచన రుక్మిణీపతీ. 26

ఉ. చల్లడముక్ పెలుంగు నిసుచక్కఁజెలంగెడుధట్టి
జాళువా, పిల్లనగ్రోవి ముత్యముల పేరును మేల్మొ
లనూలు మించులక్, గల్లయొనర్చు నందనపు
ఖాడువయొప్పఁ గళింపజాతటిక్, సల్లలితప్రచా
రములు సల్పినదేవర రుక్మిణీపతీ. 27

చ. పరమపవిత్రతాపక సుపాదసరోజపరాగరాజి
సం, వరణధురీణతామహిమ భాసిలు గోపకుమా
రపేటికా, స్ఫురదురుభాగ్యరేఖల సమున్నతిఁ
బెంపునుతింపశక్యమే?, హరిహాయ హేమగర్భని
టలాక్షులకైనను జానకీపతీ. 28

ఉ పంకజనేత్ర మీపతితపావననామ సుధారసంబు
ని, శ్శంకత నానుసత్పురుషసంతతి కెంతపనుల్ పరే

తరా,టిక్రాంకరచక్రవాళకముగీటడంగించుటమో
క్షలక్ష్మిచే, సంకలితత్వమొందుటయు సారసలో
చన రుక్మిణీపతీ 29

ఉ. శత్రు విరించి శంభునుతి చక్రవిరాజిత భూరి
భూష ని,ర్వక్రపరాక్రమక్రమ నివారిత వైరి
భవల్ల సన్కరో, పక్రమణప్రభావము గృపా
నుతి మాకు నొసంగుమయ్య యో,నక్రవినాశ
సంతుషితనాగకులాధిప రుక్మిణీపతీ 30

ఉ. నెమ్మది నమ్ముకొంటి శయనీకృతశేషఫణామణి
ప్రభా,సమ్మిళితాత్మదేహరుచిచక్రనిడంబితగోత్ర
భిద్ధను,స్సమ్మహితాంబువాహ విలసద్ద్యుతి తావక
దివ్యపాదప,ద్మమ్ములు భక్తమానవుల దాపుడు
సొమ్ములు రుక్మిణీపతీ. 31

ఉ. దండము దేవదేవ హరి దండము కుండలదీప్తిసమ్మి
ళ,ద్గండ మహాత్మ యోవికచ కాండజలోచన
యోముకుంద యో,ఖండితరాక్షసప్రకరదండము
దండము దండమయ్య యో,కుండలితల్ప మంజు
రుచి కోమలవిగ్రహ రుక్మిణీపతీ. 32

ఉ. నీరధిలోన భూరితరనిర్మలనై జరుగాంగళుల్ మహా
చారుత మీఱఁజొచ్చి ఘనసాహసమేత నదో
త్కటత్రయీ, చోరక సోమకాసురనిషూదన

తఁ దోలుపల్కులోలిమై, వారిజగర్భు నందిడిన
వారిచరాత్మక రుక్మిణీపతీ. 33

ఉ. కవ్వముగాఁగ మందరనగంబు భుజంగమరాజు
రజ్జుగా, నివ్వటిలం బయోదధి ననేకసురాసుర
కోటి మొత్తమై, క్రొవ్వునఁ ద్రచ్చుచుం; బిసఁ
గొందలమందఁగ నద్రి కూర్మతఁ, నివ్వెఱఁ
గొందఁ దాల్చి కరుణించితి వారల రుక్మిణీపతీ.

ఉ. భీకరసూకరాత్మకత బిట్టురరంగ నజాండభాండ
ముల్, వీఁక ధరిత్రి జుట్టి యతివీరు హిరణ్యని
లోచనుఁ మహోద్రేకముతో విఘాతమొన
రించి విషాణమునందు నీధరఁ, జోక యొనర్చి
పూని మునుచొప్పున నుంచితి రుక్మిణీపతీ. 35

చ. పటపటలీనఁ గంబమున బిల్వడి వెల్వడి శాతహే
తిను, త్కటనఖరాగ్రఘాతకలధౌతకశిప్వరివిగ్ర
హాంత్రసంఘటితశిరోధివై విబుధకంటకసూతిని
బ్రోచితి వెకా, పటునరసింహరూపత సుపర్వులు మె
చ్చఁగ రుక్మిణీపతీ. 36

ఉ. వేదపురాణశాస్త్రముఖవిద్య నమేయత దేవతావ
నా, పారనమంచు వామనత బాగుగఁబూని పద
త్రయంబు న, మ్మోదముతోడ దైత్యకులము
ఖ్యబలీంద్రుని వేఁడి లోకము, త్యాదరణంబునఁ
బలికి నర్పణజేసితి రుక్మిణీపతీ. 37

చ. పరువడి రాజసంఘములఁబట్టి కఠోరకుఠారధార
తోఁ, నిరువదియొక్కమాఱువధియించి భయంక
రతత్త్వమాత్కరోఁ, త్వరదురుర క్తపూరదివిషన్న
దిఁ బైత్ర్యకతర్పణంబు నిం, పరయఁగఁజేసి భార్గ
వతభాసిలితౌగద రుక్మిణీపతీ. 38

ఉ. దేవతలుబ్బఁగాఁ బిత్రుని దేశమునన్ బహుజం
తుసంతతోఁ, గ్రావనికేఁగి యంనుచరాయితవా
యుసుతుండవై లస,ద్రావణకుంభకర్ణముఖరాక్ష
సవీరవినాశనంబు స,ద్భావతఁజేసి రాఘవతభాసిలి
తౌగద రుక్మిణీపతీ. 39

చ. హలహతిచేఁ గళిందతనయాపరిభేదనమాచరించి
దోఁ, ర్బలమలరంగ దుష్టమతి బాలిశధేనుకము
ష్టికాసురా, విలయమొనర్చి లోకములవిశ్రుతిఁ
జెందినయోగ్రసాధనా, కలితకరుండవై బలతఁ
గాంచినదేవర రుక్మిణీపతీ. 40

ఉ. సుందరరూపతో త్రిపురసుందరులన్ వరియించి
పౌద్ధతన్, బొంది రయంబునన్ ద్రిపురపూర్వసు
పర్వులఁ జంపునప్పుడా, చందురుదాల్పుదేవరకుఁ
జాపశరాసనసాధనంబు లా, నందము మీఱఁగా
ననినొనర్చితివౌగద రుక్మిణీపతీ. 41

చ. తురగము నెక్కి ఘోరతరదుష్కృతసాంద్రమలీ

మసంబునా, తరతమతావిహీనభువి దార్కొని చే
త నసిఁ ధరించి స,త్వరతఁ దురుష్కసంతతిహతం
బొనరించి బుధావనంబుచేఁ,బరగినకల్కిరూపము
న భాసిలుదేవర రుక్మిణీపతీ. 42

ఉ మీఁటుమనోజుమేనిపస మీఁటుసొబంగులతీఁటు
ము త్తెపుం, బేరుసదీపితవ్యమగుపేరు మతంగజ
చారుమానముఁ, దూరు నాయూరినెన్నడ; వి
ధుఁ రుచిగేరుమొగంబు సొరునుఁ, వారిజ
జాగిరతఁగలవారుగదా హరి రుక్మిణీపతీ. 43

ఉ. వాసవుఁ డల్కమీఁటి జడివాన మహాశనిసంయు
తంబుగాఁ, జేసిన గోపకుల్ భయముజెంది
పరుంగునునొందఁ గందుకా, భ్యాసకేలిఁ గేల
గిరివర్యముబూని సమస్తబంధుతఁ, వేసటఁదీర్చి
కాచితిని వేగ జనార్దన రుక్మిణీపతీ. 44

ఉ. ఘోరదరిద్రతాభరవిఘూర్ణితమానసుఁడౌ కుచే
లుఁ డా, దారిపంచింపఁగా భవదుదంచితపాదస
రోజచింతనా, గౌరవమొప్పఁగాచి పిటకంబులు
చేరెడుదెచ్చినఁ మహేం,ద్రోరుపరార్థసంపదల
నొందఁగఁజేసితి రుక్మిణీపతీ 45

ఉ. వేణునినాదవిశ్రుతిని వ్రేతలమానసముల్ హరిం
చి యా, జాణలఁ జిత్తభూపరవశత్వయుతాత్మ

లఁజేయుచుఁ గా విని, ద్రాణమనోజకేళికల రంజిలఁ
జేసిన మీకథాసుధఁ గా, మానసపాత్రమందు
నియమంబుగ నానెద రుక్మిణీపతీ. 46

ఉ. ముద్దియ లెల్ల మొఱ్ఱలిడ బుద్ధులు సెప్ప యశోద
జోటని, న్నొద్దికమీఁటఁ గట్ట మదినోడక వేఁగొ
ని తెచ్చి దాఁచ, బల్మద్దుల రెంటిమధ్యనునమర్చి గు
గల్చినవేల్పు పెద్ద సీ, సుద్దుల నెన్నఁ దద్దు లజగూలి
మహేశులు రుక్మిణీపతీ. 47

ఉ. నమ్మను నెమ్మనంబున ననాథజనావన నిన్ను మిన్న నే
నిమ్మహి నన్యదైవముల నెన్న నమందమరందబిందు
జా,లమ్మునఁ దొప్పు నవ్యకమలంబున సమ్మద మొందు
తుమ్మెద లల్, క్రమ్మఁ గోనంగ నేర్చునె వికర్త్తనమం
దున రుక్మిణీపతీ. 48

చ. కరమున పాదపద్మము ముఖంబునఁ జేర్చి పయఃప
యోధిని,న్భరరమణీయలీల వటపత్రముపై శయ
నించి యోగమా, ర్గరతిని సర్వలోకతతిరక్షణ
మందున జాగరూకతం, బరగినదేవదేవ నను బా
గుగ నేలుము రుక్మిణీపతీ. 49

ఉ. ద్రోణసుతప్రయుక్తఖరరోపముచే హతినొంది
కుంతి ని, ప్రాణకుఁడై జననుస్యరసంగతుఁ డా
యభిమన్యుసూతి ని,ర్వాణఫలప్రదాత యదువర్థ

న కృష్ణ ముకుంద యన్యనిన్, జాణతనంబునన్
వినుతిసల్పఁగఁ గాచితి రుక్మిణీపతీ. 50

ఉ. వ్రేతలచేలముల్ మిగుల వేడుకమ్రుచ్చిలితెచ్చి
వారి న, త్యాతతమానభంగమున నానతశీర్షలఁ
జేయుచు నునో, జాతనికేతనంబులకుఁ జాటు
గనుంచ కపాలమందునన్, జేతులు మోడ్ప వస్త్ర
ములు శీఘ్రత నిచ్చితి రుక్మిణీపతీ. 51

ఉ. చిన్నతనంబునన్ విసపుచేపునఁ బాలనొసంగు
పూతనన్, మన్నిగొనంగఁ జేసితివి వద్దుఁగూల్చి
తి బండిసాకునన్, భిన్నముగాఁగఁదన్నితి వభీ
రుత నీచరితంబు నెన్నఁగాఁ, బన్నగభూషణుండ
యినఁ బొల్పడనేర్చునె రుక్మిణీపతీ. 52

ఉ. కొన్నిదినంబులజ్ఞతను గొన్నిదినంబులు శైశవం
బునన్, గొన్నిదినంబులంగనల కూరిమినిన్ మఱి
కొంతకాల మ,త్యున్నతచింతచే వగలనొందుచు
నుందురుగాక నెన్నఁగా, నెన్నఁడు మీపదాబ్జ
ముల నెన్నరు మూర్ఖులు రుక్మిణీపతీ. 53

ఉ. నీవె ధనంబు బంధుఁడవునీవె సఖుండవునీవె తల్లి
యున్, నీవె గురుండు దాతయునునీవె శరణ్యుఁ
డవంచు నెమ్మదిన్, దేవరవారిపాదములు దిక్క
నినమ్మితి నింకనైన నన్, గావుము దేవదేవ హరి
కంజవిలోచన రుక్మిణీపతీ. 54

ఉ. బంధువులేమిచేయుదురు భార్యయుఁదల్లియుఁదం
డ్రియైననుఁ, బంధురసత్కృపామతి శుభంబు
మతేమియొనర్తు నుగ్రసీ, రంధ్రపరేతరాట్కృ
తదురాపదలొందభవత్పదాబ్జసం, బంధమెతక్క
నన్యసదుపాయముగల్గునె రుక్మిణీపతీ. 55

ఉ. పాణితలంబునందు మృదుభవ్యనినాదతరంగయు
క్తమౌ, వేణువువేణియందుఁ బరిపీతములైనమ
హాశిఖండముల్, నాణెపుముక్కుముత్తెముగనం
బడ నందునిమందయందునన్, జాణతనంబుమీ
ఱ రతిసల్పినదేవర రుక్మిణీపతీ. 56

ఉ. కందసమానగాత్ర పరకందఖనిత్ర మునీశకీసమా
కంద మురారి శౌరి హరి కందళితప్రథిశార్ఙ్గ
భాపుక, స్కందకుమారగీతయశకందర రక్షిత
గోసమూహ మా, కంసము జాపు మీవ్రజ
లకందళుకున్ గతి రుక్మిణీపతీ. 57

ఉ. పంకజపత్రవారివిధి పారదభంగి నిరంతరంబు
నా, తంకయుతంబునై వగలఁదాల్చుశరీర మని
త్యమం చెపన్, గొంకక మీపదస్మృతిని గోరిన
వారలకున్ బరేతరా, ట్కింకరభీతిఁ జెందదఁట
కృష్ణ మురాంతక రుక్మిణీపతీ 58

ఉ. ఏమితపంబుచేసెనొ కరీశుఁడు నందుఁడు పూర్వ

జన్మమం, దేమిమహావ్రతంబు జనులెంచఁగఁజేసె
నా గోపకౌఘ మే, మేమి యొనర్చెనో యవి
యు నెన్నికఁజేయ విరించిశంభుసు, త్రాము లశ
క్యమే హారిణతామరసేక్షణ రుక్మిణీపతీ. 59

ఉ. శ్రీస్తనభూరిభూమిధరసీమల నండలనుండి సర్వ
లోకస్తవనీయవైభవముగాంచి ఘనత్వనిరూ
ఢినొందుకృ, ష్ణస్తనయిత్నుతల్లజమునన్ సుఖజీ
వన మొందఁజేయు మో,కౌస్తుభరత్నజంభరిపుకా
ర్ముకశోభిత రుక్మిణీపతీ. 60

ఉ. మాధవ శౌరి శార్ఙ్గి వనమాలి మురారి మనో
జ్ఞహారిని, ర్బాధవిహారి చక్రి హారి భావుకశీలి ఘ
నాభమూర్తి పృథ్వీధరధారి పత్రిపతివీతి సుధీర
చితామితస్తుత, స్వాదుతరాకృతీ విబుధజాలకృ
తానతి రుక్మిణీపతీ. 61

ఉ. కొంకక కృష్ణకృష్ణ యనుకోరికకున్ మతిబుట్టున
ట్లుగా, శంక యొకింతలేక మురశాసన! మీపదప
ద్మ మాత్మలో, నంకముగాఁగఁజేయ నిసితాంగ
తురంగుని దూరుచుందు!న, న్నింక భవత్పదసాద
మున నేలుము దేవర రుక్మిణీపతీ. 62

ఉ. బాలత నాయశోదచనుబాలు రయంబున నాను
చున్ విలో,లాలకజాలమాంద్యమున కందముల్

నఁగ నూపసక్తజం, బాలముతోడ నందునినివా
సము ముంగిట నాడుచుండుగో,పాలకవేషధా
రివగు బ్రహ్మమనీవవు రుక్మిణీపతీ. 63

ఉ. ఏకమతిన్ భవత్స్మరణ మెప్పుడుజేయక యంత
మందునన్, బైకొని కాలకింకరులుబాధలు పెట్టెడి
కాలమబ్బినన్, శోకమునొందినన్ గలదె చోర
తబూని తుదిన్ నిబద్ధుడై, కాకలనొందనేమిటికిఁ
గంజవిలోచన రుక్మిణీపతీ. 64

ఉ. బంధురసత్కృపామతిని బంకజలోచన మీపదా
బ్జసం,బంధినిజేసి నన్నితరబంధములన్ విడఁజేయు
మయ్యా! యీ,బంధనమేలనయ్యా!ఫలదాయక!నా
యక నీవెదిక్కుయో, కంధరనీలవర్ణ ననుగావుము
వేగమె రుక్మిణీపతీ 65

ఉ. ఆడుచు గోపకామినులయంబరముల్ మఱపించి
తెచ్చి బల్, పోఁడిమిమీఱఁగా గుబురుపొన్న
లనెక్కిన దేవదేవ నన్, వేడుకమీఱఁగా నెపుడు
వీడకనేలుము పూర్ణతారకా, రాడమలాస్య
కృష్ణ యదురాజశిఖామణి రుక్మిణీపతీ.

ఉ. అన్యులవేఁడఁ దావకపదాబ్జమె మాకికఁ దోడు
నీడఁగా, ధన్యతనొందువాఁడ మిముదల్చుమహా
త్ముఁ వీడ దుష్టరా,జన్యులఁ జూడఁ గామ్యముల

